మహాకవి కాళిదాసకృత

# కాళికాస్తుతి.

( దశశ్లోకి )

బుధజనో[redacted]

ఆంధ్రప్రతిపదవిశేషార్థవివరణములతో

సమేత

రచయిత:

ఉభయభాషాప్రవీణ

**శ్రీ విల్లి అన్నప్ప దీక్షితులు**



గ్రంథము నచ్చు వేయించిన మహోదారులు

బ్రహ్మశ్రీ లంక సుందరం M. A. Ph. D గారు

సర్వోదయ కార్యక్రమోద్ధారకులు

పార్లమెంటు మెం..ప.

పార్లమెంటు మెంబరును, "సర్వోదయోద్ధారక"

బిరుదాంకితులును అగు

డాక్టర్ శ్రీ లంకసుందరము M. A. Ph D. గారికి

గ్రంథకర్తగారిచే సమర్పింపబడిన

# పద్య పుష్ప మాలో పహారము.

---

శ్లో॥ శ్రీ ధరోఽవ్యాద్ధయగ్రీయః । కాశ్యపాన్వయసమ్భవమ్
సున్దరమ్ సున్దరాఖ్యానమ్ । శ్రీభూపుత్రాయురన్వితమ్. 1

ఉ. కలిగిరి యాగదీక్షితులు గౌరవపాదపమూలకందముల్
సలలిత వేదశాస్త్రఘనసంచయపారగులౌ మహాత్మకుల్
ఫలయుతసత్తపస్వులును భావజరూపులు మేలుసేతకున్
నిలయులు లంకవంశజు లనింద్యులు కాశ్యపగోత్రమందునన్. 2

ఉ. వారలలోన మేటియని వన్నెనుగొన్నఁడు సీతారామయే
పోరును నేర్వకుండు ఘనపుణ్యులలో మొదలుండువాఁడు,సం
చారపుతీరుచే జనులఁ జక్కనిదారికిఁ ద్రిప్పువాఁడు దాఁ
గారణజన్ముఁడన్న నుతిఁగాంచిన విప్రుఁడు బందరందునన్. 3

ఉ. కాపురముండెనాతఁడొక కాలమునాడును బూరుషాంతరుల్
మాపుల రేపులన్ గనులమానిని మోమును జూడనట్టిదే
పాపము నేరనట్టిదగు పావనశీల పతివ్రతామణిన్
శ్రీపతిభార్య నాఁదగిన చేడియ రామయమాంబఁ గూడి తా॥ 4

ఉ. వారలకున్నవించి రతివాగ్గుణశీలురు వైదికాదరుల్
ధీరులు మూర్తిసంఖ్యులు సుధీవినుతుల్ పరమార్థపారగుల్
వీరలు ధర్మమందు జయవీరిది సామ్య జనానుకూలసం
చారులు తల్లిదండ్రులకు సల్పెడు పుత్రులు సర్వసేవలన్. 5

ఉ. సోదరులందుఁ బెద్దయగు సుందరుఁ డున్నటుఁ బెద్ద, స
ర్వోదయబద్ధకంకణుఁడు నూర్జితశక్తి యశోభిరాముఁడున్
వాదులఁబోక విద్యల శబాసనునట్లుగఁ బల్కనేర్చు వే
లాదుల వేదులన్ ఘనదయాగుణశాలి విశిష్టదాతయున్. 6

ఉ. శంకరనామకుండు జనసంఘసమాదృతజీవి, రంపవం
శాంకుర మాంధ్రకావ్యముల నన్నిటి నేర్చినదిట్ట నన్నునీ
లంకకులోద్భవున్ గలిపి లక్షణముల్ వివరించి తెల్పి ని
శ్శంకగఁ గాళిదాసకృతిసల్పఁగఁ బ్రోద్బలమిచ్చె నాదటన్. 7

ఉ. ఆతఁడు కాళిదాసకృతమంచు నుతిన్ గను కాళికాస్తుతిన్
జేతము సల్లఁగా వినుచుఁ జేయుడు తెల్గునఁ గబ్బమట్లుగా
విత్తవిహీనతన్ దమరు వెన్కకుఁ దీయకుఁడంచు తెల్పి తా
నాతతభక్తితో నొసగె నాకృతికిన్ స్థిరరూపసంపదన్. 8

ఉ. పాండితిలేనివారు కవిభావములన్ గనలేరు, పండితుల్
మొండిశిఖండివాదముల మూర్ఖులయట్టులఁ బల్కుచుందు రీ
తం డటుగాక భావము పదంబుల యర్థరసంబులెల్లఁ దా
నిండుగఁ గోరి మత్కృతిని నిల్పెను భూమినిఁ గాళికాస్తుతిన్. 9

సుందరు మందహాసము వసుంధరలో గలమేటి సుందరీ
బృందములోఁగఁజేయును వివేకము పండితమండలిన్ మహా
నందమునందు ముంచును ఘనంబగు వాక్చతురత్వమన్యులన్
బందమువేసి నిల్పుచు శపాసనిపించు నదెంతపుణ్యమో. 10

పావనమైనజీవనము పల్కులభాగ్యము విగ్రహంబునన్
జీవమునొందు మన్మథువజీరుగఁజేసెడు రూపురేఖ, సం
భావమునొందు దీనజనపాలన మెల్లర వృద్ధిగోరు నీ
భావముకార్యరూపమునభాగ్యమునిచ్చు టదెంతపుణ్యమో. 11

సీ. అడుగుపెట్టినచోట నన్నంబులేదను
నార్తనాదము లడుగంటిపోవు
పలుకు సౌభాగ్యంపు పటిమఁ గాంచినతోడ
దేశద్రోహులసంఖ్య తేలిపోవు
ప్రజలసౌఖ్యమునకుఁ బరికరంబులఁబట్ట
దారిద్ర్యదోషంబు తలఁగిపోవు
సంఘుంబులకునెల్ల సాహాయ్యమునుజేయఁ
గయ్యంబు లన్నియుఁ గాసిపోవు

తే. గీ. ఇట్టి సుగుణపేటివి జగజ్జెట్టివగుచు
గాంధిమతమున తూ,చా,లు కదపకుండ
నడచి నడపించి ప్రజలకు నయముఁదెల్పి
ప్రోచినాడవు కలవునఁ బురములెల్ల. 12

పేరుకు నామినేషనును బెట్టినమాత్ర జయంబునొందు నీ
తీరును జూడగా రిపులు తీరనిబాధలఁ దెల్లఁబోవుచు

న్నారోక లంకసుందరుఁడె నాయకుఁడౌనని వేదవేత్తలున్
తీరుగ సామముల్ సదివి తెల్పిరి కే కుశతాయుషన్నతుల్ 13
బీదలపాటుఁ బోనడఁచి పెద్దలగౌరవమెంచి యంటటన్
వాదములెల్లమాన్చి జనవంద్యుఁడవై కర్మములోలిసేయుచున్
సాదుల వేదవారిలను సామ్యముగల్గఁగ జూచునట్టి నీ
పీడయ నేర్పుగాఁగుసుపులెవ్వరొ యచ్చెరువాయె సుందరా!14
పారను జేతఁబట్టి గనుపారఁగఁ జూచిననారికెల్ల నే
పారిన మేనిసౌరణఁగఁ బల్లెలఁబల్లలఁ బెద్దవాడలన్
జేరిపురోభివృద్ధికిని జెప్పుచు మార్గము పట్టి పోయె నీ
తీరును జూచువారలకుఁ దీరునె తాపము లంకసుందరా. 15

సీ. ధనములేక చదువఁ దలపోయకొంటివి
యెటులైతివార్యుఁడ యింజనీరు
భుక్తికి నిడువారు పోడమరంటివి భూమి
నబ్బెనే యెటు విద్య న్యాయవాది
పుట్టంబులకులేక పొత్తంబులకులేక
శాస్త్రంబులెట్టులఁ జదివినావు
విత్తంబులేదంటి విలువకబ్బములెల్లఁ
బ్రకటించ నెట్లయ్యెఁ బండితుండ

తే. గీ. అనుచు నన్యోన్యభాషల నాంధ్రులెల్లఁ
జెంది మేలును మరచుట చేటటంచు
లంకసుందరుచేసిన జంకులేని
దానధర్మములను మదిఁ దలచుచుంద్రు. 16

సర్వవిధములు సదయంబు జరుగుచనుచు
లలితసూక్తుని నిర్వోందె రాజ్యలక్ష్మి. 20

అందరు నెన్ను వారమున నాతుకతేఁ బరువెత్తుచుందు రే
యందలమెక్కి యో విజయమందఁగ విత్తము నెల్లఁజిమ్ముచున్
దెంపములోనఁ గుందవాక ధీరుని కెవడి నింటనుందువో
సుందర! విత్తమిమ్ము కడు చోద్యముగల్గును నీదు నెన్నికన్. 21

సీ. సర్వోదయం? ని చాటించుటయకాని
పనుల నావంతేనిఁ బాటుపడఁడు
అన్న వస్త్రములకు నల్లాడెననుగాని
పోగొట్టు నుపపత్తిఁ బూనఁడొకఁడు
వసువలేనునుగాని నాఁటఁడు మొక్కల
విస్తులపథంబుల వేయఁబోఁడు
ఉదకంబు లేదను నుద్దేశములెకాని
నూతులఁద్రవ్వింపఁ జేతులిడఁడు
తే. గీ. అటుల నాయకులుండఁగ నాదుకొనుచుఁ
బ్రజల దుఃఖంబుఁ బోఁగొట్టఁ బాటుపడుచు
నున్న నిన్నెన్ని వంతలనన్ని వీడి
మాన్యమాయెను వాత్తేరు మండలంబు. 22

ఆయువయోగభాగ్యముల నందుచు నాత్మజకీర్తి భోగసం
ధాయక శాలిశీలివయి ధార్మిక శ్రేష్ఠుఁడనొచు ధాత్రిలోఁ
బాయని భూతి సంఘుకయుఁ [illegible]చు నాయకధర్మమెల్ల వా
లాయము పొందె వృద్ధిఁగొను లక్ష్మినిఁ జేఁగొని లంకసుందరా.

# పండితాభిప్రాయములు.

శ్రీ వాసా అన్నప్పశాస్త్రిగారు, వ్యాకరణశిరోమణి, సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ. } సంస్కృతభాషోపన్యాసకులు, ప్రభుత్వకళాశాల, రాజమండ్రి.

బ్రహ్మశ్రీ ముక్కవిల్ల్యన్నప్పదీక్షితవర్య విరచితయా బుధతోషిణీ సమాఖ్యవ్యాఖ్యయా సముద్భాసితాం కాలికాదేవీస్తుతిపరాం దశశ్లోకీమిమాం మామూలచూడ మవలోకయమ్। ఇయంచ దశశ్లోకీ కాలికావరప్రసాదలబ్ధమహామహిమశాలినస్తత్రభవతస్సుగృహీతనామధేయస్య కవికులగురోః కాలిదాసస్య వదనారవిన్దాద్గలితః ప్రథమో వాగవతార ఇతి సార్వజనీనా ప్రథా వరీవర్తి। అస్యేధాటీసమతిశాయిధాటీ విశేషాంచితశ్రుతిసుభగవృత్తగతిసముల్లసితా పండితాపండిత సాధారణమమన్దహృదయానన్దమాదధతీ జగతి జాగర్త్యయం కాలికాస్తుతిరిత్యపరోక్షమిదం సమేషామ్॥

యద్యపి కాలిదాసీయతయా సకలవిబుధసంప్రతిపన్నేషు రఘువంశాదిషు యాదృశీ లోకోత్తరాఽనితరసాధారణా శైలీ సమనుభూయతే నైతాదృశీ దశశ్లోకీగతా శైలీతి నేయం కాలిదాసకృతిర్భవితుమర్హతీత్యత్ర కోఽప్యవకాశో విప్రతిపత్తేః, తథాపి విలక్షణశోభాపరిమాణయోః శారదవార్షికస్రోతస్వినీపూరయోరివ ఘృష్టాఘృష్టమణ్యోరివ చ నానయోశ్శైల్యోర్వ్యాపస్తావికభేదకల్పనముచితమిత్యబాధితలోకప్రతీతిశరణైరస్మాభిరభ్యుపగన్తవ్యమితి మన్యామహే। కించాత్ర శైల్యాం యమకానుప్రాసాదిశబ్దాలంకారపారిచర్యనిబన్ధనో యశ్శబ్దాడంబరస్సోఽయ

మశ్వధాటీ వృత్తాత్మికాయామస్యాం స్తుతౌ నాన్తరీయకతయా సమాదృత ఇతి భూషణమేవేదం న దూషణం భవితుమర్హతి। శబ్దాలంకారఘటనాచాతుర్యమనితరసాధారణమస్య కవికుల తిలకస్య రఘువంశనవమసర్గీయ శ్లోకచరమచరణాదిషు ప్రచు రతయా సందృశ్యత ఏవ। వ్యంగ్యవైభవం రసభావాలంకారాది పరిపుష్టిశ్చ రఘువంశాదిష్వివాత్రాప్యనన్యానత్రైవేనా స్తీతి వ్యాఖ్యాత్రా తత్ర తత్ర బహుధా ప్రపంచిత మస్త్యేవ. ఏవం వస్తు స్థిత్యవిరుద్ధం లోకప్రతీత్యనుగృహీతంచ వైలక్షణ్య మాపాతతో౽ను పపత్తిదోష కలితమిత్యాకలయన్తో నవీనచారిత్ర పరి శోధకాః కాలిదాసకృతిషునేమాం పరిగణయితుమపారయన్ని త్యేవ వక్తుం న్యాయ్యమ్.

సమధిగతబహుళప్రచారాయా అప్యస్యాః యావద ర్థావగమస్సమగ్రవ్యాఖ్యానసాపేక్ష ఏవేతి నావిదితం ప్రేక్షావ తామ్। కాలగత్యా విరలీభవతి సంస్కృతభాషాప్రచారే ప్రాచీనగ్రంథావగమన శక్తౌ క్రమశః క్షీయమాణాయాం ఏతా దృశ వ్యాఖ్యానానుదయే సుతరాం దురవగమార్థతా క్రమశ ప్రచార లోపశ్చాస్యా భవిష్యతీత్యాకలయన్తో దీక్షితవర్యాః మహతా ప్రయాసేన సర్వాంగసుందరీమిమాం బుధతోషిణీం విరచయ్య మూలస్య సుబోధతాం సంపాద్య మహతీం లోకోప కృతిం విదధానాః నూనం ధన్యా ఇత్యాకలయామః.

ఇదమేవచానుసంధాయ శ్రీమద్భిః 'ర్లంక సుందర' మహోదయైః స్వహృదయధురీణైరాంధ్రార్థ వివరణయోజనమపి వ్యాఖ్యాతృ హస్తేనైవ కారయిత్వా ముద్రాపయిత్వాచ స్వీయధనవ్యయేన

కాలిదాసకృతి రియం సకలార్థిహస్తగతతామాపాదితేత్యహో! తేషాముచితజ్ఞతా,రసికతా, సంస్కృతభాషాసమాదరణశీలతా పండితపక్షపాతితా చ బహుధా ప్రశంసార్హా।ఏవమేతౌ వ్యాఖ్యాతృముద్రాపకమహాశయౌ ఉత్తరోత్తర గ్రంథనిర్మాణముద్రాపణాదిభిర్లోకోపకారపరాయణౌ సకలశ్రేయోభాగినౌ దీర్ఘాయుష్మన్తౌచ భూయాస్తాం పరమకారుణికస్య పరాత్పరస్య భగవతః కృపావిశేషేణేత్యాశాసే—

రాజమండ్రి 15-4-52 } వాసా అన్నప్పశాస్త్రి

★ ★ ★

బాలవ్యాసవ్యాకరణాచార్య
శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. } పిఠాపురం.

అయిమహాశయాః! ప్రథితమేవైతత్, యత్కాలికాదేవ్యసాధారణానుగ్రహలాభేనాఽసదృశాఽనర్గల కవితావిరాజితః కవికులమూర్ధన్యః సార్థకనామా కాళిదాసమహాకవిరితి.

చిరస్మరణీయోఽయం మహాకవిః తామేవ కాలికాదేవీం దశశ్లోక్యాఽశ్వధాటీ వృత్తాత్మికయాఽస్తౌషీత్.

సేయం దశశ్లోకీ శబ్దాదిగాంభీర్య సమంచితా సామాన్యతో దురధిగమార్థా టీకా సాపేక్షా బహుభిః పఠ్యమానా చ దరీదృశ్యతే.

స్థితేచైవం తద్వ్యాఖ్యానేన లోకోపకృతిం కర్తుకామాః శ్రీముక్కవిల్ల్యుపనామకాన్నప్పదీక్షిత మహాశయాః బహుపరిశ్రమ్యాఽభేద్యస్థలేషు సమన్వయసరణిం సమ్యక్ ప్రదర్శ

యస్తః బుధతోషిణీటీకా మారచయ్య కృతకృత్యా అభూవన్. ఏతాదృశస్య లోకోపకారకస్య గ్రంథస్య ముద్రాపణకార్యం నిర్వాహ్య స్వీయం విద్యాభిమానం లోకోపకృతించ విశదీకృతవతాం శ్రీలంకోపనామక సుందరార్యాణాం ధన్యతాం సంభావయామః. సేయంటీకా దశశ్లోకీస్తుతి పారాయణపరాణాముపకుర్యాదితి విశ్వసిమో వయమ్.

ఇత్థం
బాలవ్యాస, వ్యాకరణాచార్య
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

★ ★ ★

వ్యాకరణశిరోమణి, విద్వాన్
శ్రీదర్భా సర్వేశ్వరశాస్త్రిగారు
Pandit, W. G. B. College.

Bhimavaram.
ది 18-4-52

బ్రహ్మశ్రీ ముక్కవిల్లి అన్నప్పదీక్షితులుగారు రచించిన శ్రీకాళిదాసకృత కాళీదశశ్లోకీస్తుతి వ్యాఖ్యానమును స్థాలీపులాక న్యాయమునఁ జూచితిని. ఆమూలాగ్రముగఁ జూడవలయునను కుతూహలమున్నను సంసారపరిస్థితులనుబట్టి చూడలేకపోయితిని. ఈ వ్యాఖ్యానపద్ధతి కోశప్రదర్శనము అలంకారపరిశోధనము మున్నగు విషయములందు నామూలంలిఖ్యతే కించిన్నానపేక్షితముచ్యతే అను మల్లినాథపండితుని శైలిని స్మరింపఁజేయుచున్నది. ఇద్దానినిజూచిన యల్పజ్ఞాధికజ్ఞులుగూడ ప్రశంసింతురనుట యందతిశయోక్తిలేదు.

ఈ మహాకార్యమునకుఁ దోడ్పడిన బ్రహ్మశ్రీ లంక సుందరము గారెంతయుఁ బ్రశంసనీయులు. ఇక్కాలమున నిట్టి పనులకుఁ దోడ్పడువారు అరుదుగదా. కావున నియ్యది వారి భక్త్యాగ్రేసరత్వమును సహృదయత్వమును పాతప్రతిపత్తి నిజాటునున్నది.

దర్భా సర్వేశ్వరశాస్త్రి.

# ఉపోద్ఘాతము.

శ్లో॥ పురాకవీనాం గణనా ప్రసఙ్గే । కనిష్ఠికాఽధిష్ఠితకాళిదాసా
అద్యాపితత్తుల్యకవేరభావా। దనామికాసార్థవతీబభూవ॥

భావము:—కవులలో నెవరుగొప్పవారనుప్రశ్న కలిగినప్పుడు మొట్టమొదట చిటికెనవ్రేలితో కాళిదాసును లెక్క పెట్టిరి, తరువాత అతనితో సమానుఁడగు కవిలేక లెక్కపెట్టఁదగు వేరొకకవిపేరు దొరకలేదు అందుచేత నే అనామిక (ఉంగరపు వ్రేలు) సార్థకనామధేయము కలదయినదని పెద్దలు చెప్పుచున్నారు. అనగా కాళిదాసుతో సాటిగలకవిలేడని భావము.

అట్టిగౌరవమునుబొందిన కాళిదాసు ఎక్కడివాఁడో? ఎప్పటివాఁడో? ఏవంశమువాఁడో? నిర్ధారణముగాఁ దెల్పశక్యముగాకయున్నది, కాని నవీన చారిత్ర పరిశోధకులు మాత్రము కాళిదాసు క్రీస్తుపూర్వము 1వ శతాబ్దము వాఁడనియు, 3వ శతాబ్దము వాఁడనియు, 1వ శతాబ్దివాఁడనియు, క్రీస్తు తర్వాత 5వ శతాబ్దివాఁడనియు ననేకవిధములఁ జెప్పుచున్నారు. ఎవరికిఁ దగినసాక్ష్యములను వారు చూపుచుండుటచేతను, ఒకరియుక్తిచే మఱియొకరి యుక్తి ఖండితమగుటచేతను నేటికిని కాళిదాసు కాలముమాత్రము నిర్ణయము జేయ శక్యముకాకున్నది. ఇట్లే ప్రదేశమునుగూర్చియు, అతనివంశమును గూర్చియు నిర్ణయింపలేకున్నారు. కాని అతఁడు మేఘసందేశాది కావ్య ములలోఁ జేసిన వర్ణనావిశేషములనుబట్టి ఉజ్జయినీపట్టణ ప్రాంతమువాఁడని కొందరనుచున్నారు. వంశచరితము మాత్రమేమియుఁ దెలియశక్యము గాకున్నది కాని యతనిచే రచింపఁబడిన గ్రంథములుమాత్రము కొన్నిదొరకు చున్నవి. అందులో 1 రఘువంశము. 2 కుమారసంభవము. 3 మేఘసం దేశము. 4 ఋతుసంహారము అనునాల్గును కావ్యములు, 1 శాకుంతలము

మాళవికాగ్నిమిత్రము. 3 విక్రమోర్వశీయము అనునవి మూడును నాట
కములు. ఇంకను కొన్ని గ్రంథములు కొన్ని చాటుశ్లోకములు కాళిదాస
కృతములుగా లోకములోఁ బ్రసిద్ధినిగన్నవి కనఁబడుచున్నవి. ఈతనికృతు
లన్నియు హైందవులచేతనే గాక విదేశీయ పండితోత్తములచేఁగూడ అధిక
ముగ మన్నింపబడుచున్నవి. అనేకభాషలలో కనువదింపబడుటచే నేటి
ప్రపంచమున నన్ని దేశములవారును దెలిసికొని యీతనిని ఈ గ్రంథములను
వేనోళ్ళ కొనియాడుచున్నారగుటచే వీని కవితామాధుర్యము, గ్రంథ
ప్రాశస్త్యమును వెల్లడియగుచున్నవి ఈకవివతంసునకింతటి యనర్గళధారా
రూపమగుకవిత యెట్లలవడెనా - యను సందియ మందరకును గలుగకపోదు.
అతని నామమునుబట్టియు నాతఁడు రచించిన కాళీస్తుతినిబట్టియు నితఁడు
భక్తితో కాళికాదేవినుపాసించి మానవులయందుఁ గనివినియెఱుఁగనియపా
రకవితాశక్తిని పొందెనని తెలియుచున్నది. అదిగాక కాళిదాసు నిర్ధనకుటుంబ
సంజాతుఁడనియు, కాళికాదేవిని బ్రార్థింపగా నామె ప్రత్యక్షమై వెంటనే
నాలుకమీఁద బీజాక్షరములను లిఖించెననియు నద్దానవపరిమిత ప్రవాహరూప
మున కవితాస్రవంతి యావిర్భవించెననియు, వెంటనే తనయెదుటదివ్యమంగళ
విగ్రహముతో ప్రత్యక్షమైన సర్వలోకపూజ్యురాలగు కాళికాదేవిని పదిశ్లోక
ములచేస్తుతించెననియు నా కాళీకటాక్షముచే రాజసన్మానములందనేక సత్కా
రములబొందెననియు, లోకోత్తరములగు గ్రంథముల రచించెననియు, సర్వజన
సామాన్యమగు ప్రతీతి లోకమున నిలబడియున్నది. ఈకవిచేతనే రచింపఁ
బడినవగు నీశ్లోకములకు నేటివఱకు సరియైన వ్యాఖ్యానముగాని
తెలుఁగర్థమును గాని లభింపలేదు. అయినను శ్లోకములు శ్రోత్రపేయములగుటచే
సకలప్రాణి హృదయరంజకముగాను, పండితాదరణీయభావార్థ రసాలంకార,
ధ్వని సమన్వితములుగనుండి కాళికోపాసకులచే నిత్యము పారాయణము
చేయఁబడుచున్నవి. మంత్రోపాసకులుపారాయణచేయుటచేతనే వీనియందు
మంత్రములందువలె మహిమగలదని తెలుచున్నది. అందుచేతనే కాలగర్భ
మున నణగిపోక నేటికిని మహిమాన్వితములయి విరాజిల్లుచున్నవి. ఇట్టిశ్లోక
ములను నేనప్పుడప్పుడు చదువుచు నర్థభావాలంకార రసధ్వనుల కచ్చెరువడి

వానియందలి కావ్యలక్షణములను విమర్శించుచు స్నేహితులతో జెప్పుచుండెడివాఁడను. ఇట్లుండ నొకనాడు శ్రీ లక్ష్మీనారాయణవదన ప్రేరణచే నీశ్లోకములకు సంస్కృతభాషలో వ్యాఖ్యానము చేయవలెనను కౌతుకము జనించి ప్రారంభించితిని. కాని యివి యనేక పాఠాంతరసహితములు, నవ్యాశయములును గంభీరార్థయుక్తములును దురవగాహములునయి చాలచోట్ల కష్టపెట్టినవి. అయినను అస్మద్గురువర్యులును, రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాలా సంస్కృత భాషోపన్యాసకులును, సకలశాస్త్రసాంప్రదాయ పారంగతులును అగు (బ్రహ్మశ్రీ) వాసా అన్నప్పశాస్త్రిగారు ఈకృతియందు ప్రత్యక్షరములను జదివి, విమర్శించి యర్థపాఠభేదములను వ్యాకరణాది శాస్త్రసాంప్రదాయములద్వారా నిర్ణయించి సహాయము చేయుటచే నేను కృతకృత్యుఁడనయితిని. కొన్నిప్రదేశములందు ధర్మశాస్త్రవిరోధ పరిహారములను జేసి సిద్ధాంతముఁ గూడఁ దెల్పవలసివచ్చినది. ఈకవిత్వము సర్వజ్ఞురాలగు కాళికయొక్క కరుణాకటాక్షలబ్ధమగుటచే నల్పజ్ఞుఁడనగు నేనెన్ని యర్థభావములను వెల్లడించినను ఇంకనులోపభూయిష్ఠముగ నేకన్పించుచుండును. కనుక పండితాగ్రేసరులీగ్రంథమునందలి గుణములను గ్రహించి దోషములను నాకు తెల్పిన యెడల మరల అచ్చువేయించునపుడు దిద్దుకొందునని సవినయముగఁ మనవిజేయుచున్నాను.

సర్వోదయ కార్యకర్తయు బద్ధకంకణులును పార్లమెంటు మెంబరును అగు శ్రీలంక సుందరము M. A. Ph. D.; M. P. గారు ఒకప్పుడు రాజమండ్రి రాగా వారితోకలిసి ఈశ్లోకములను వ్యాఖ్యానములను చదివి వినిపించితిని. ఈశ్లోకములు వారికంతకుపూర్వమే కంఠస్థములై యుండుటచే నేతెల్పినభావముల కానందమునొంది సంస్కృతవ్యాఖ్యానము కొద్దిమందికే తెలియునుగనుక తెలుఁగున ప్రతిపదార్థవివరణములతో వెల్లడింపవలసినదని నన్నుఁ బ్రోత్సహించిరి. వారిప్రోత్సాహమునఁ దెలుఁగునవివరించి మరల వారు రాజమండ్రివచ్చునపుడు చదివి వినిపింపఁగా "నేనీగ్రంథము నచ్చువేయించెద"నని వెంటనే ముద్రాపకులఁబిల్చి దానికివలయు విత్తము

తయు నొక్కచ్చుడినిచ్చి ఆంధ్రభాషకును, ఆంధ్రులకును మహోపకారము చేసి వారి సహృదయతను పండితపక్షపాతమును వెల్లడిచేసిరి. ఇట్టివారిని బట్టియే భర్తృహరికూడ "సజ్జనులు తార పరహితాచరణమతులు" అని వచియించినాడు. వీరికను ఇట్టిగ్రంథముల రచనకుం బండితులం బురి గొల్పుచు నాంధ్రలోకమునందు జ్ఞానోదయ వికాసములకు తోడ్పడుచుం డుసర్వోదయ కార్యక్రమమును సక్రియముగావించి నిర్వహింతురుగాక. శ్రీలక్ష్మీహయగ్రీవమూర్తి వీరిని సకలశ్రేయోభివృద్ధిగా రక్షించుగాక.

నే రచించిన యీదశశ్లోకీవ్యాఖ్యను సావధానముగా బరిశీలించి "గుణదోషౌబుధోగృహ్ణన్నిందుక్ష్వేళావివేశ్వరః । శిరసా శ్లాఘతేపూర్వం పరం కణ్ఠేనియచ్ఛతి" యను నార్యోక్త్యనుసారముగ దోషములనువిడిచి గుణములనే యుగ్గడించుచు నవ్యాజకృపాదృష్టితో నభిప్రాయముల నొసగి నాకుత్తరోత్తర గ్రంథరచనకు ప్రోత్సాహమును కలుగజేసిన మహనీయులగు పండితప్రకాండులకు గాకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాను.

రాజమహేంద్రవరము
20-5-52

గ్రంథకర్త.



శ్రీ లక్ష్మీ హయ గ్రీ వా య న మః

# మహాకవికాళిదాసకృతా కాళీస్తుతిరూపా దశశ్లోకీ

## బుధతోషిణీటీకయాఆన్ధ్రప్రతిపదవిశేషార్థవివరణేనచోపేతా

### ప్ర థ మ శ్లో కః

చేటీభవన్నిఖిలఖేటీ కదమ్బవనవాటీషు నాకిపటలీ
కోటీరచారుతరకోటీమణీకిరణకోటీకరఞ్జితపదా
పాటీరగన్ధికుచశాటీ కవిత్వపరిపాటీ మగాధిపసుతా
ఘోటీకులా దధికధాటీ ముదారముఖవీటీరసేనతనుతామ్.

### బు ధ తో షి ణీ టీ కా.

శ్లో. విద్యామూర్తిం ముఖస్థపస్థవలయశ్వేతారవిన్దస్థితమ్
వ్యాఖ్యాభిఖ్యస్ఫటికాద్రినిర్మలతనుం విద్యోతమానం శ్రియా
వాణీజాసితవల్లభం ప్రతిపదవ్యాఖ్యాతృ మాహ్నాయా
గర్భాదినిపూరయమం హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్॥

శ్లో. పురాగస్త్యవామ్నే భవన్యా ఉపాస్తిం।
దదానాత్మనిష్ఠాం స హేరమ్బనాన్య
వ్యాదిష్టో ఽద్య బ్రూతే దశశ్లోకటీకాం।
తతో గన్ధగన్ధో న మేస్తి ప్రశస్తిః॥

శ్రీలక్ష్మీహయవదనలీలావిలాసావిర్భూతాయా మస్యాం వాఙ్మయ్యాం జగత్యామనేకకవితావిశారదాః ప్రసమభూవన్నితి సర్వవిదితమ్। తేషు కాళిదాసః కనిష్ఠికాధిష్ఠితః నద్వితీయో స్తీతిప్రథా ముపజగామ। అత ఏవ కవితాసామ్రాజ్యమూర్ధాభిషిక్తో గీయతే। స చా జన్మాన్తరే ధః విద్యాగన్ధ

మూన్యశ్చ। తథాపి కాళికావరప్రసాదేన మహాకవిమూర్ధన్యో జాత ఇతిసర్వ
జనీనా వార్తా ప్రచలతిస్మ। యస్యాః ప్రసాదాసాదనావిర్భూతసకలవిద్యావివే
కోఽయం కాళిదాసః ప్రథమమ్ తామేవ కాళికాం నిరర్గళమధురయా రసా
లఙ్కారభావభరితయా శ్రుతిసుభగయా వాచా స్తోతుం సముపచక్రమే
సా చ స్తుతిః దశశ్లోకీపరిమితా విజయతే। సా చ లబ్ధహయగ్రీవానుగ్రహేణ
కుశికనన్దనగోత్రజేన ముక్కువిల్లీత్యుపనామకేన అనన్తప్పదీక్షితేన బుధతో
షిణ్యా టీకయా భక్తజనామోదాయ విశదీక్రియతే చేటీతి।
అగాధిపస్య= హిమవతః, సుతా= పుత్రీ, పార్వతీ దేవీ కవిత్వపరిపాటీం
రసేన=అనురాగేణ,తనుతాం=విస్తరీకురుతామిత్యన్వయః।సాదేవీకీదృశీ? కదమ్బా
నాం=నీపవృక్షాణాం,వనం=కాననం.తస్యవాటీషు=పఙ్క్తిషువర్తమానేత్యర్థః।స
ప్తమ్యాఅధికరణార్థత్వాత్।అచేట్యఃచేట్యఃభవన్తీతిచేటీభవన్త్యః, తాదృశ్యఃనిఖిల
ఖేట్యః_సకలదేవాఙ్గనాః యస్యాస్సాతథోక్తా। సకలలోకపూజ్యాః।దేవవనితా
అపిఅస్యాఅనుగ్రహసమ్పాదనాయపరిచారికాత్వంస్వయమేవాపన్నా ఇత్యర్థః।
అనేన చాస్యా స్సర్వదేవతోపాస్యత్వం సర్వోత్కృష్టత్వంచ గమ్యతే।కం=
సుఖం,తన్నభవతీత్యకం=దుఃఖం,నాస్త్యకమత్రేతి నాకః = స్వర్గః,"స్వరవ్యయం
స్వర్గనాకత్రిదివత్రిదశాలయా"ఇత్యమరః నాకఃఏషాంనివాసత్వేనాస్తీతి నాకి
నః=మహేన్ద్రప్రభృతయస్సర్వేదేవాః। తేషాంయాపటలీ=సమూహః,తస్యాః
కోటీరాణాం=మకుటానాం,యాఃఅత్యన్తంచారవఃచారుతరాః, కోటయః=అ
గ్రప్రదేశాః, తాసుయాఃమణ్యః=రత్నప్రభేదాః,తాసాంయేకిరణాః=కాన్తయః
కోటీకాఇవ=ఇన్ద్రగోపాఇవే-త్యుపమితసమాసః, తైఃరఞ్జితేపదేయస్యాస్సా
తథోక్తా। సముజ్జ్వలారుణకాన్త్యా కిరణానా మిన్ద్రగోపకీటసాదృశ్య మితి
భావః। కోట్యా-బహుధా, కాయతి-ప్రకాశత ఇతి కోటికశ్శబ్దోప పదాత్కై-
ధాతోః కప్రత్యయే కోటికేతి రూపమ్ తచ్చేన్ద్రగోపకీటార్థకం జటాధరవచ
నాత్సిద్ధి వాచస్పత్యమ్। వర్షాసు సహ్యాచలే ఆవిర్భూయ ప్రచలన్త ఇం।ద్రగోప

కీటా యథా నిజాత్యన్తారుణ్యరఞ్జితం స్వచలనదేశం కుర్వన్తి తద్వదేవ దేవ మకుటకిరణాః పరస్పరాస్తాః స్వాత్యన్తారుణిమానురఞ్జితం సహజనీలం దేవీ చరణయుగలం కుర్వన్తీతి భావః। సహజసుఖసమ్పదో నిర్జరా అపి జ్వాలద్ర త్నాఞ్చితమకుటై రస్యాః కాళికాయాః పాదయుగళం సాష్టాఙ్గం ప్రణమ న్తీతి భావః ఏతేన దేవానా మశాశ్వతస్వర్గనివాససుఖానాదరః, దేవీపాద సేవనద్వారా శాశ్వతసుఖాధిగమాభిలాషః దేవ్యాశ్చ లోకోత్తర మహిమశా లితా చ ద్యోత్యతే। శాశ్వతసుఖం చ ముక్తి రేవేతి ముక్తిదాయినీయం కాళి కేతి తదాశయః। అత ఏవ దిక్పాలకానా మపి దేవీపాదసేవనం యుజ్యతే పటీర ఏవ పాటీరః శ్చన్దనం, తస్య పఙ్కస్య గన్ధోస్యాస్తీతి, తాదృశీ కుచ శాటీ-కుచపరిధానవస్త్రం యస్యాస్సాతథోక్తా। గన్ధశబ్దా త్ప్రశంసాయా మినిః చన్దనవిలిప్తకుచసంశ్లేషవతశ్చైలస్య చన్దనగన్ధవత్త్వా దుపపన్నా, ఏతేన చాస్యా మహాభోగలాలసతా వ్యజ్యతే। నానా-వస్తుసమృద్ధిమతీ ముఖవీటికే తామ్బూలం యస్యాస్సాతథోక్తా। ఏలా లవఙ్గాది సుగన్ధద్రవ్యయుక్తానర్ఘ తామ్బూలచర్వణశీ లేత్యనేన భోగసీమానుభూతి ర్వ్యజ్యతే। అనేన చ విశేషణ ద్వయేన పార్వత్యాః సర్వమఙ్గళాత్వం సుప్రతిష్ఠితం భవతి। నగచ్ఛన్తీత్యగాః- పర్వతాః, తేషామధిపశ్య-హిమవతః, సుతా పార్వతీ కీర్తి పర్వతరాజదుహి తేత్యనేన చాస్యా ఆభిజాత్యం మహావైభవం చ వ్యజ్యతే। కవయతీతి కవిః- సహృదయహృదయగ్రాహి శబ్దార్థసంఘటనానుగుణప్రతిభాన్వితః, తస్య భా వస్తత్త్వం, తస్య పరిపాటీమనుక్రమం ఆనుపూర్వీం వా తనుతాం విస్తారయత్వితి ప్రార్థనాయాం లోట్। కవనపరిపాటీ మేవ విశినష్టి ఘోటీకులేత్యాదినా। ఘోటీ నాం-అశ్వానాం కులం-సముదాయః, తస్మాదధికా ధాటీ-అభ్యవస్కన్దనం తద్వత్ కవిత్వపరిపాట్యాం అప్రియతే న ఝడితి శబ్దార్థస్ఫురణరూప మితి ద్యోతకమ్ తాదృశీ ధాటీ యస్యా స్తా మితి సమాసవిశేషణమ్। అతి కాన్తా

శ్యాధాటీం కవిత్వధాటీం ప్రార్థయ తీత్యర్థః। నితాన్తం కవిత్వపరిపాకేం రసేన అనురాగేణ తనుతా మితి సమ్బన్ధః। ‘‘శృఙ్గారాదౌ విషేవీర్యే గుణేనైరా గేద్రవేరస’’ ఇతి ప్రోక్తా ద్రసశబ్ద స్యానురాగార్థకత్వం। మాభూత్తే యావ త్పార్థసీయజ్ఞానశూన్యస్య మమ ప్రార్థనానిర్బన్ధః కిన్తు మదీయాయ మితి సహజానురాగేణ తే ప్రవృత్తి రస్త్విత్యర్థః। తదైవ స్వకవనస్య సమగ్రపరి పుష్టి ర్విస్తృతిశ్చ భవిష్య తీతి కవిహృదయమ్॥ అత్ర స్వతః నీలవర్ణయో పాదయోః రక్తత్వప్రాప్తివర్ణనాత్ స్వనైల్యగుణత్యాగపూర్వకం దేవకిరీట మణిరాగరూపోత్కృష్టగుణప్రాప్త్యా తద్గుణాలఙ్కారః। రక్తత్వ ప్రాప్తేరస మ్భవేపి తత్సమ్బన్ధోక్తే రతిశయోక్తిశ్చ। ప్రాక్తేరగన్ధికుచశాటీ ఉదారముఖవీ టీతి సమృద్ధి మద్వస్తువర్ణనా దుదాత్తాలఙ్కారః। కిరణాః కోటీకా ఇవే త్యుపమా చే త్యేతాసాం తిలతణ్డులవత్సంసృష్టిః। అత్ర సర్వత్ర స్తుతా వాస్తి తిచ్ఛన్దః। తస్మింశ్చ ‘‘త. భ. య. జ. స. ర. న. గ.’’ ఇతిగణక్రియబన్ధః ఆద్యసప్తకద్వయే సాన్త్యేన చ విశ్రాన్తిః। ప్రాశయతి శ్చేతి సర్వం శ్రీవణకు భగ మిత్యాహ కవే సతృష్ణః। సంస్కృతభాషాయాం క్వాచిత్కైస్తైవై తాదృశైః ప్రచురప్రాసై ర్బ్రాహ్మైరనుభూతత్రుత్యానన్దా ఆన్ధ్రకవయః తద్వి కృతిభూతాయాం మాతృభాషాయాం ప్రాసనియమం ప్రాసయతించ కల్ప యామాసు రితి ప్రతీయతే। అత్ర కాళికాస్తుతిర్విషయః భక్తిసాధ్యముక్తిరేవ ప్రయోజనం, ప్రతిపాద్యప్రతిపాదకభావ స్సమ్బన్ధః, జిజ్ఞాసవో భక్తా అధి కారిణ ఇత్యనుబన్ధచతుష్టయం సూచితం భవతి॥

ప్రతిపదార్థము:—కదమ్బ = కడిమిచెట్లయొక్క, వన = తోటల యొక్క, వాటీషు = పంక్తులయందు (ఉన్నదియును), చేటీభవత్ = చెలికత్తె లుగానయిన, నిఖిల = సమస్తమైన, ఖేటీ = దేవతాస్త్రీలుగలదియు, నాకి దేవతలయొక్క, పటలీ = సముదాయముయొక్క, కోటీర = కిరీటముల

కట్టి విద్యాధిక్యమును కవితాపటిమయు నెట్లు సంభవించును? దేవీప్రీతిజనకములు కనుకనే దేవి నుపాసించువారు నేటికిని ఈశ్లోకములతో స్తుతింతురు. అర్థము తెలిసినను తెలియకున్నను ఈపద్యముల నాలకించినంతమాత్రమున పరవశులగుదురు. అదియుగాక యివి మంత్రములవలె దేవ్యనుగ్రహము ద్వారా ప్రత్యక్షఫలములనుగూడ నిచ్చును. అందుచేతనే యివి యితరశ్లోకములవలె కాలగర్భమున నశించక చిరజీవనముల విరాజిల్లుచున్నవి.

ఆంధ్రవివరణము:— హిమవంతునికూతురగు పార్వతీదేవి నాయందలి కరుణచే కవిత్వపరిపాటిని వృద్ధిచేయుగాకయని కాళిదాసు కాళికను ప్రార్థించుచున్నాడు. మిగిలిన పద్యములచే కాళికాదేవి యెట్టిదో వివరించుచున్నాడు. కాళికాదేవి తనపాదస్పర్శ నానందమును కలిగించు కడిమితోటలయందు నివసించియున్నది. దేవతాస్త్రీలందరును చెలికత్తెలుగానయి యామెను సేవించుచున్నారు. సకలలోకములచే బూజింపబడగిన దేవతాస్త్రీలే దాసీలవలె నీమెను సేవించుటలో గలభావమేమనగా? పార్వతీదేవి సకల దేవతాస్త్రీలకంటె నెక్కుడుమహిమ గలదియనియు, సర్వదేవతోపాస్యురాలనియు గ్రహింపనగును. కనుకనే వారంతటివారే దాసీలుగావచ్చి యామెయనుగ్రహమును సంపాదించుటకు సేవించుచున్నారని భావము. స్వర్గనివాసులగు దేవతలందరునువచ్చి, విలువయిన మాణిక్యములచే ప్రకాశించునట్టి కిరీటములుగల శిరస్సులువంచి యామెపాదములకు నమస్కరించుచుండిరి. అప్పుడు వర్షాకాలమున వానచేతడిసిన నల్లనిభూమియందు ఆరుద్రపురుగులు గుంపులుగూడినచో నాభూమియెట్లుండునో యట్లే దేవిపాదములుగూడ ఆదేవతల కిరీటమాణిక్యకాంతులచే నెఱ్ఱబడియున్నవి. సర్వసౌఖ్యసమేతులయిన దేవతలామెకు నమస్కరించుటనుబట్టిచూడగా దేవతలకు అశాశ్వతమయిన స్వర్గసౌఖ్యమునం దాదరణము లేదనియు, ఈమె నుపాసించి

తద్ద్వారా శాశ్వతసుఖరూపమయిన ముక్తిని పొందవలెననియు దేవి మహా మహిమగలదనియు వెల్లడియగుచున్నది. అందుచేతనే దేవతలు గుంపులుగా వచ్చి సర్వకాల సర్వావస్థలయందును నీపాదములను [illegible] నమస్కరించు చున్నారు. ఇట్లు నమస్కరింపకున్నచో వజ్రమయిన నీపాదములు లెక్క బడుట సంభవింపదు. అనగా నీమె దిక్పాలకులనుగూడ సేవింపగలశక్తి గలదనియు, నీమెను సేవించినగాని ముక్తిలేదనియు, కనుకనే దేవతలామెను సేవించుచున్నారనియు గ్రహింపవలెను. కైటువేసుకొనిన వస్త్రముగూడ పరిమళించువంతటి సుగంధద్రవ్యముల నధికముగా నలంకరించుకొనినది. ఏలా లవంగాది పరిమళద్రవ్యములు సమృద్ధిగాగల శాంభవియును సేవించు చున్నది. ఈవిశేషణములచే పార్వతి భోగలాలసురాలనియు, సుఖైశ్వర్యసం పన్నురాలనియు, సర్వమంగళయనియు తెలియవలెను. అట్టి పార్వతీదేవి సకలహృదయ రంజకమయి, గురువులధాటిని మించినధాటిగల కవిత్వస్ఫూ ర్తిని నాకు ప్రసాదించుగాకయని ప్రార్థించుచున్నాడు. కవిత్వధాటియనగా కవనము చేయునపుడు శబ్దార్థములు ఒకదానికంటె నొకటిమించుచుండగా స్ఫు రించుటయని తెలియవలెను. అనగా తనకవిత్వమందు ప్రయత్నమేమియు నక్కరలేకుండగనే శబ్దార్థములు తొందరగా వచ్చుగాకయని ప్రార్థనము. అట్టికవిత్వమును ప్రేమతో నొసంగుమని ప్రార్థించుచున్నాడు. ఓ పార్వతీ నేను కించిజ్జ్ఞుడను. కనుక కోరవలసినవానినన్నిటిని కోరలేను. అందుచే వీడు ప్రార్థించుచున్నాడుగదాయని నాకు కవిత్వవిస్ఫూర్తిని చేసినచో రసాదిపరిపుష్టియుండదు. నీవు సర్వజ్ఞురాలవుగనుక "వీడు నావాడను" ప్రేమను నాయందుంచి నాకవిత్వపోషణమును చేయుము. అట్లయినచో కవనము సర్వజనమనోరంజకమయి సమగ్రపుష్టిచే విస్తృతిని జెందునని కవిహృ దయము. ఈశ్లోకమునందు "స్వతస్సిద్ధముగా నల్లనైన దేవీపాదములు దేవ తల కిరీటమాణిక్యములచే నెఱ్ఱబడినవని చెప్పుటచే తద్గుణాలంకారము, ఎక్కి

బడుటు అసంభవమయినను సంభవించినట్లు చెప్పుటచే అతిశయోక్తి, వస్తుసమృ
ద్ధిగల తాంబూలాదుల సేవించుచున్నదనుటచే నుదాత్తాలంకారము. కిరణము
లను ఇంద్రగోప కీటసాదృశ్యమును జెప్పుటచే నుపమాలంకారమును గలవు,
ఈయలంకారములన్నియు తిలతండులములవలె కలియుటచే సంసృష్టి యని
గ్రహింపవలెను. ఈశ్లోకములు పదింటియందును ఆకృతిచ్ఛందముగలదు.
దీనియందు త. భ. య. జ. స. ర. న. గ. అనుగణములు క్రమముగా యుం
డవలెను. మొత్తము 22 అక్షరము లొక పాదమునందును, 7. 7. 8 అక్షర
ములపైని యతి యుండును. ఇట్లే నాలుగుపాదము లుండవలెను. నాల్గుపా
దములందును ప్రాసను వేయుటయే గాక ప్రతిపాదమందును ప్రాసయతినిగూడ
వేసి శ్లోకమునకు శ్రుతిసుభగత్వమును గూర్చినాడు. సంస్కృతభాషలో
కొద్దిగానున్న యిట్టిప్రాస ప్రచురములయిన శ్లోకములను విని, చదివి
ఆనందించిన తెలుగుకవులు తద్వికృతియయిన తెలుగుభాషయందు ప్రాస
నియమమును ప్రాసయతిని కల్పించియుందురని తోచుచున్నది. ఈగ్రంథము
నందు కాళికాస్తుతి విషయము, భక్తిలభ్యమగు ముక్తియే ప్రయోజనము.
ప్రయోజ్య ప్రయోజకభావమే సంబంధము. తెలిసికొనగోరు భక్తులందరును
అధికారులు, అని అనుబంధములను తెలియవలెను.

---

శ్రీ లక్ష్మీ హయగ్రీవాయ నమః.

## ద్వితీయశ్లోకః

ద్వైపాయనప్రభృతిశాపాయుధత్రిదివసోపానధూళిచరణా
పాపాపహా స్వమనుజాపానులీనజనతాపాపనోదనపరా
నీపాలయా సురభిభూపాలకానుమితరూపా గుణవత్యవతు మాని
రూపాధికా శిఖరిభూపాలవంశమణిదీపాయితా భగవతీ.

## బుధతోషిణీ

సకలదుఃఖాపనోదకం పాపక్షయం ప్రార్థయతి ద్వైపాయనేతి।
ద్విర్గతా ఆపో యస్మిం స్తద్ద్వీపమ్ "ఋక్పూరబ్ధూః" ఇతి సమాసాన్తః।
ద్వ్యన్తరుపసర్గేభ్యో ప ఈదితీకారశ్చ। ద్వీపమేవాయనమ్ యస్య సః
ద్వీపాయనః స ఏవ ద్వైపాయనః=వ్యాసః తత్ప్రభృతయో యే శాపాయు
ధాః, శాప ఏవాయుధమ్ యేషాం తే తథోక్తాః తపోధనా ఇత్యర్థః।
ఆయుధత్వారోపాదాయుధకార్యాణా మాత్మరక్షణార్తత్రాణ- శత్రు
పరాజయాదీనాం శాపే సద్భావ స్సూచితః। ఏతేన వ్యాసాదీనాం మహత్త్వేన స్వ
నిగ్రహానుగ్రహసామర్థ్యం చ గమ్యతే। తథాభూతానాం తేషామ్. త్రిది
వస్య=స్వర్గస్య, సోపానాని త్రిదివసోపానాని, తద్రూపాః ధూళయః =
పరాగాః యయో స్తే, తాదృశీ చరణే యస్యా స్సా తథోక్తా। యథా ఉత్తు
ఙ్గస్థలారోహణాయ ఘనీభూతపార్థివాణుసఙ్ఘాతాత్మకాః ధూళయః సోపా
నత్వ మాపద్యన్తే తద్వద్దేవీపాదధూళయః వ్యాసాదీనాం స్వర్గారోహణాయ
సోపానత్వేనో పయుజ్యన్త ఇత్యర్థః। అత్ర సోపానపదే నారోహణం తేన
స్థూలశరీరగమనం చ ద్యోత్యతే। సూక్ష్మశరీరగమనస్య సోపానానపేక్షత్వాత్
జ్యోతిష్టోమాదిసాధ్యస్య స్వర్గఫలస్య శరీరనాశానన్తరభావిత్వాత్ వ్యాసా
దయః ఏతేనైవ స్థూలశరీరేణ వినా ద్రవ్యాదిక్లేశం స్వర్గం నిసాధయిషవః.
తదేకోపాయభూతే దేవీపాదభజనే ప్రవృత్తా ఇతి భావః। అనేన చ కర్మాపే

శయా భక్త్యా సత్కృష్టస్సిధ్యతి। పాపమపహన్తీతి పాపాపహః। సచాసౌ స్వమ
న్త్రః= స్వమన్త్ర ఇతి కర్మధారయః। తస్య జాపః=జపనమ్ "జపమానసేవ"
ఇత్యస్మా ద్భావే అలకా ద్ఘఞ్। తస్మి న్లలీనాః=అత్యన్తాసక్తాః యే జనాః
తేషాం తాపానా మాధిభౌతికాదీనా మపనోదనే=ఉపశమనే నిపుణా=చతురా
మద్యపవిత్రస్వమన్త్రజపస్య పాపాపహత్వమసమ్భవి। ప్రారబ్ధస్యానుభవమాత్ర
నాశ్యత్వేన ప్రకారాన్తరేణ నాశ్యత్వా యోగాత్। తథాపి జపస్య ప్రారబ్ధ
జనితతాపోపశామకత్వం వర్ణనీయమ్। తథాసతి పాపాపహత్వమేవ పర్యవస్యతి।
పాప జనితతాపోపశమనే సతి సతోఽపి పాపస్యాకిఞ్చిత్కరత్వాత్। అత్ర
మన్త్రజపస్య యత్తాపోపశామకత్వం తచ్చ తదధిష్ఠానదేవతా ప్రీత్యైవేతి
జ్ఞేయమ్। అతఏవ పాపజనితతాపనివారణ మస్యా యుజ్యతే। ఏవం చపాపా
పనోదకేన స్వమన్త్రజపేన సుప్రీతా దేవీస్వభక్తానాం తాపోపశమన మేవ
ఘటయతీతి భావః। "జపతో నాస్తి పాతక" మితి వచన స్యాపి పాపజనిత
తాపోపశమన పరత్వమేవేతి బోధ్యమ్। అతఏవ పాపాపనోదకత్వేన విహితస్య
ప్రాయశ్చిత్తకలాపస్య తత్ప్రతిపాదకశాస్త్రకలాపస్యచ సార్థక్యముపపద్యతే
అతఏవ చ "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" ఇత్యత్ర జ్ఞా
నాగ్నిదాహ్యత్వ మాగామిసఞ్చితయో రేవేతి శఙ్కరభాష్యోక్తం సఙ్గచ్ఛతే
తాదృశతాపనివారణం చ దేవ్యాః లోకోత్తర నైపుణ్యం వినా నఘటత ఇతి
తాదృశనైపుణీప్రదర్శనాయ, తా ముద్యోజయితుమ్ కేవలా భక్తి రేవ సాధన
మిత్యహో సర్వాతిశాయీ భక్తే స్సముత్కర్షః। దేవీప్రసన్నతా సమ్పాదన
పర్యాప్తజపానుశీలనే నైవ తదిదం సులభమిత్యను లీనపదేన గమ్యతే। అథవా
జనానాం సమూహో జనతా "గ్రామజనేతితల" స్తస్యాః అపాకే= పుణ్య
కర్మణి, నోదయతీతి నోదః= ప్రేరణమ్, తస్మిన్నిపుణా= సమర్థా। పూర్వో
క్తేఽర్థే తాపోపశామకత్వద్వారా ప్రారబ్ధస్య కిఞ్చిత్కరత్వమ్, అస్మిన్నర్థే
పుణ్యాచరణప్రేరకత్వద్వారా ప్రారబ్ధస్యాకిఞ్చిత్కరత్వ మితి విశేషః
నీపాః= కదమ్బా ఏవ ఆలయః =నివాసస్థానం యస్యాస్సా నీపాలయా॥
సురభిః= (ఘ్రాణతర్పణః యోధూపః తద్వాసిన్యాలకాః చూర్ణకున్తలాః

మస్యాస్సా ఇత్యుక్తా కృష్ణాగురుధూప సద్భూశనీల- సురభిమ్లానకుసు మేత్యర్థః। పార్వతీకచానాం స్వత ఏవ సురభిత్వ మితి శివపురాణేషు ప్రసిద్ధమ్। రూపేణ= సౌన్దర్యేణ అధికా= సర్వమహతీ, సౌన్దర్యశోభినీ త్యర్థః శిఖరా ణ్యేషాం సన్తీతి శిఖరిణః తస్యవంశే=కులే, అన్వత్ర వేశంచ "వంశో వేణౌ కులే వర్గే పృష్ఠాద్యవయవేపి" చేతి మేదినీ। మణి రేవ దీపః, స ఇవాచరతీతి ఇత్యుక్తా అత్ర రూపకేనచాస్యా దీపస్య తైలాదినిరపేక్షత్వే మనిస్వాపనీయత్వమ్ తత శ్చాలోకసామాన్యత్వమ్ ద్యోత్యతే। సర్వప్రకాశకదీపకార్యకారిత్వా దస్యాః వంశప్రకాశత్వం గమ్యతే। యథా ఉత్పన్నమణినా నేన్యో రాభిజాత్యం సుప్రతిష్ఠితం తథై వానయా సర్వస్యాపి పర్వతకులస్యే త్యర్థః। భగవతీమద్గుణైశ్వర్యసమ్పన్నా పార్వతీ ఏతేన చోత్తారణసామర్థ్యం గమ్యతే దుష్టైః కర్మభి రితం = ప్రాప్తం దురితమ్- పాప మిత్యర్థః క్షణికస్య కర్మణః అపూర్వసమ్పాదనోత్తరమ్ క్షీయమాణత్వా ద్దుష్టకర్మజనితమ్ యదపూర్వం తదేవ పాపమితి గృహ్యతే। తదేవకూపః, తస్మాన్మా ముదఞ్చయతు= ఉద్ధారయత్వితి ప్రార్థనా పాపానాం కూపత్వేన రూపణ ముత్తరణస్యా న్యాపేక్షావశ్యకత్వద్యోతనాయ। సత్యామప్యన్యాపేక్షాయామక్లేశేనోత్తరణాయాస్త్ర ప్రియత్న ఇత్యర్థః। మామిత్యనే నోత్తరణాసమర్థ మనన్యగతికమ్ సర్వథా దయనీయ మితి చ గమ్యతే। దేవీమన్త్రజపాద్యుతేతాపోపశమనే ఉపాయాన్తరాణా మకిఞ్చిత్కరత్వం సూచితం భవతీత్యర్థః। అత ఏవపరిత్యక్తసకలాయాసజనక కృచ్ఛ్రచాన్ద్రాయణాది ప్రాయశ్చిత్తకలాపానాం జనానామ్ దేవీమంత్రజపకేవలశరణ్యతేతివిజ్ఞేయమ్।

అర్థము:—ద్వైపాయన= వ్యాసుఁడు, ప్రభృతి= మొదలుగా గల, శాప + ఆయుధ= శాపాయుధ= బ్రాహ్మణులకు, త్రిదివ = స్వర్గముయొక్క, సోపాన= మెట్లుగానయిన, ధూళి= పరాగముగల. చరణా— పాదములుగలదియు, పాప= పాపములను, అపహా = పోగొట్టునట్టి స్వ— శీవయొక్క, మను= మంత్రముయొక్క, జాప = జపమునందు, అనులీన=

లీనమయిన (తాదాత్మ్యమును పొందిన) జన= మనుష్యులయొక్క, తాప= ఆధిభౌతికాది తాపములయొక్క, అపనోద= శాంతింపజేయుటయందు, నిపుణా = నేర్పుగలదియు (ఇక్కడమరొకవిధముగ గూడ పదవిభాగమును జేసి యర్థమును జెప్పవచ్చును, జనతా= మనుష్యసముదాయమును, అపాప-పుణ్యకర్మలయందు, నోద= ప్రేరేపించుటయందు, నిపుణా= నేర్పుగలది) సురభి= పరిమళించుచున్న, ధూప= పొగవలెనల్లనైన, అలకా = ముంగురులుగలదియు, నీప = కడిమిచెట్లు, ఆలయా= నివాసస్థానముగాగలదియు, రూప = అందముచే,అధికా= గొప్పదియు, శిఖరి = పర్వతములయొక్క, భూపాల = రాజగుహిమవంతునియొక్క. వంశ = కులమునకు; మణి + దీపాయితా= మాణిక్యదీపమువంటిదియు నగు, భగవతీ= షడ్గుణైశ్వర్యవంతురాలయిన కాళికాదేవి, మాం= నన్ను, దురిత= పాపములనెడు, కూ, పాత్ = నూతినుండి. ఉదక్ష్చాయతు=లేవనెత్తుగాత॥

ఆన్వయవివరణము;— సకలదుఃఖములకును కారణభూతములైన పాపములను నశింపజేయుమని కవి యీశ్లోకముచే దేవిని ప్రార్థించుచున్నాడు. గొప్పతపస్సులుచేసి మంత్రసిద్ధిచే నిగ్రహానుగ్రహశక్తిని సంపాదించిన వ్యాసాదులు గూడ స్థూలశరీరముతో స్వర్గాదిలోకములను పొందగోరి యీకాళికాదేవి పాదపద్మములను సేవించుచున్నారు. అంత ఆమె పాదమునందలి ధూళివీరికి స్వర్గమునకు మెట్టుగానయినది. అనగా దేవీ పాదరేణువొక్కొక్కటి యొక్కొక్క మెట్టుగానయి వ్యాసాదులను భౌతికశరీరముతో స్వర్గమునకు దీసుకొనివెళ్ళినదనిభావము లేదా ఒక్కరేణువే స్వర్గలోకపర్యంతమును మెట్లుగానయినదనియు నిచ్చటగ్రహింపవచ్చును. స్వర్గాదిపుణ్యలోకములను జెందవలెనన్నచో నగ్నిష్టోమాదులగు ననేకసాధనములున్నను అయజ్ఞాదులనువిడచి వ్యాసాదులీమె పాదముల నాశ్రయించుటచే యజ్ఞాదులు ద్రవ్యకాయక్లేశసాధ్యములనియు, యజ్ఞాదులద్వారా కలిగిన

స్వర్గము చిరకాలానుభోగ్యము కాదనియు, ఈజన్మమున యజ్ఞాదులను జేసినచో పరలోకజన్మమునగాని స్వర్గాదులు గలుగవనియు, జన్మాంతరమందైనను స్థూల శరీరముతో చేరుట దుర్లభమనియు, ఈమెపాదసేవద్వారా స్వర్గాదుల పొందినచో నచ్యుతకల్పాంతముండనచ్చుననియు, ఈజన్మముననే స్థూలశరీరము తో నేగవచ్చుననియు వ్యాసాదులభావము స్పష్టమగుచున్నది. అందుచేతనే కర్మలకంటె భక్తికి ప్రాధాన్యమిచ్చిరని తెలియవలెను. ఆకాళికా పాదరేణు వులకే యింతశక్తి కల్గినచో నామె శక్తియూహింపనలవికాదు. కాళికా మంత్రజపము సకలపాపములను బోగొట్టును. అట్టితనమంత్రమును జపించు భక్తులకాధిభౌతికాది తాపత్రయనివారణము చేయగలనేర్పు ఈమెకుగలదు బాగుగనాలోచించినచో నిచ్చట నీవిశేషమును దెలియవలెను.

ప్రారబ్ధకర్మ మనుభవించవలయునే కాని యుపాయాంతరములచే నది నశించదు. అయితే మంత్రజపాదులవలన ప్రారబ్ధముచే పుట్టిన తాపాదులు శాంతించునని గ్రహింపవలెను. అనగా తాపాదులుశాంతించుటచే ప్రారబ్ధ మున్నను నిప్పుడు గప్పిన నిప్పువలెనేమియు చేయలేక శక్తిశూన్యమై యుండుననిభావము. మొత్తముమీద పాపజనిత తాపమునేశాంతింపజేసినను మంత్రజపము పాపములను గూడ శాంతింపజేసినట్లగును. మంత్ర జపముచే సంతోషించిన దేవత, భక్తులకు తాపోపశమనమును జేయు నని గ్రహింపవలెను. కనుకనే పాపములచేబుట్టిన తాపముల నుపశమింపజేయు టయే మెకు తగియున్నది. "జపతో నాస్తి పాతకమ్" అను వాక్యమునకుగూడ ఈయర్థము (పాపజనిత తాపోపశాంతి) నే గ్రహించవలెను. శాంతికర్మలను ఆకర్మలను శాసించుగ్రంథములును ఈతాపోపశమనమునే బోధించుచున్నవి. అందుచేతనే గీతాభాష్యములో "జ్ఞానాగ్ని అన్నికర్మలను భస్మము జేయు" ననెడుచోట ఆగామిసంచితములనే గ్రహించి, ప్రారబ్ధమును విడచి యున్నాడు. విచిత్రనైపుణ్యముచే అగ్ని నితాకినను కాలకుండ నుండునట్లు కాళికానైపుణ్యముచే ప్రారబ్ధమున్నను తజ్జనిత తాపత్రయశాంతి జరిగిబాధ

లై

కలుగకుండునని తెలియవలెను. పార్వతీదేవియట్టి నైపుణ్యమునుజూపి తాపశాంతి చేయవలెనన్నచో నామెకు సంతోషము కలుగునంత మంత్రజపమును భక్తితో జేయవలెనని భావము. లేదా ఈమంత్రజపమును జేయు మనుష్య సముదాయమును పుణ్యకర్మలు చేయుటయందు ప్రేరేపించు నేర్పు ఈమెకు గలదనియు గ్రహింపవచ్చును. అనగా పాపాత్ములగువారు సాధారణముగా మరల పాపములనే చేయుచు, నాకర్మల ననుభవించుటకు మరలపాప జన్మములనే పొందుచు నాజన్మలందుగూడ తిరిగి పాపములనే చేయుచు నీ విధముగ కల్పాంతమువరకు పాపఫలరూపమయిన జననమరణములను పొందుచుందురు. కనుక పాపకర్మల నాచరించువారి కెన్నటికిని పుణ్యముల జేయుటయు, తద్వారా యున్నతలోక ప్రాప్తియు లేదు. ప్రారబ్ధకర్మానుసారముగా బుద్ధికలుగుచుండును. కనుక పాపాత్ములకు పాపబుద్ధియేగాని పుణ్యబుద్ధికలుగదని సిద్ధాంతము. అయినను మనుష్యజన్మ పుణ్యపాప మిశ్రితమయి యుండును కనుక ఏదేని పూర్వపుణ్యకర్మవశమున కాళికామంత్రజపముగాని తత్కథాశ్రవణముగాని, తత్పూజలుగాని చేసినచో నట్టివారికి గూడ పుణ్యమునందు ప్రేరణచేసి సుగతిని పొందింపగల నేర్పీమెకుగలదనెడు నర్థమును గూడ నీపదమునకు చెప్పుకొనవలెను. అదే పశుపక్ష్యాదిజన్మలకంటె మనుష్యజన్మమునకుగల శ్రేష్ఠత్వము. ఇచ్చట భక్తితో జేయు మంత్రజపము పాపజనిత తాపోపశాంతిమాత్రమే కాక, పుణ్యకర్మాచరణమునుగూడ జేయుననెడు విశేషార్థమును గూడ గ్రహింపవలెనని భావము. ఈమె పరిమళించు నగరు ధూపమువలె నల్లనైన ముంగురులు కలది. పార్వతీదేవి జుట్టునకు స్వతస్సిద్ధముగనే పరిమళముండునని శివపురాణములందు ప్రసిద్ధము. మిక్కిలి యందముగలదై యీమె హిమవంతుని వంశమునందు మణిదీపమువలె ప్రకాశించుచున్నది. అనగా హిమవంతుడు పర్వతరాజైనను ఈదీపముచేత శాశ్వత ప్రకాశమునొందియున్నాడు. సాధారణముగా రాజులగృహములందు సామాన్యుల గృహములందుకంటె నెక్కుడు తేజోవంతములగు దీపము

## తృతీయశ్లోకః

యాలీభిరాత్తతనురాలీలసత్ప్రియకపాలీషు ఖేలతి భవ
వ్యాలీనకుల్యసితచూలీభరా చరణధూలీలసన్మునిగణా
యాలీభృతిశ్రవసితాలీదళం వహతి యాలీకశోభితిలకా
శాలీకరోతు మమకాలీ మనఃస్వపద నాలీకసేవనవిధౌ.

## బుధతోషిణీ

బ్రహ్మానన్దహేతుమ్ కాళికాపాదసేవనమ్ ప్రార్థయతి యాలీతి:—
యా = కాలీ, ఆలీభిః = సఖీభిః, ఆత్తా = ధృతా, తనుః = శరీరమ్ యస్యాస్సా తాదృశీసతీ, అలీభిః = పఙ్క్తిభిః, లసన్తః = ప్రకాశమానాః, ప్రియకాః = కదమ్బ వృక్షాః యాసు తాసు పాలీషు = ప్రదేశేషు ఖేలతి । నీపప్రియక కదమ్బాస్తుహలిప్రియ ఇత్యమరః । ఆలిర్వ్యాళదాళయోః । త్రిషు స్త్రియాం వయస్యాయాం సేతౌ పఙ్క్తౌ చకీర్తితేత్యుభయత్రాపి మేదినీ, ఆ అల్యతే ఇత్యాలీ, అల భూషణాదౌ ఇత్యస్మాత్ కృదికారాదక్తిన ఇతి ఙీష్ పక్షే సర్వధాతుభ్య ఇనితి ఇన్, అత ఏవరూప ద్వయసిద్ధిరితిజ్ఞేయమ్ । పాలిః కర్ణలతాయామ్ స్యాత్ప్రదేశే పఙ్క్తి చిహ్నయోరిత్యజయః । ఏవంచ సహచరీభిర్నో పరినిక్షిప్త హస్తా కదమ్బవన పఙ్క్తిషు ఖేలతీత్యర్థః । అనేనచ దేవ్యాస్సౌకుమార్యమైశ్వర్యమ్ చ ద్యోత్యతే ।

అథవా అలీభిః = పఙ్క్తిభిః, లసన్తః, ప్రియకాః = కుఙ్కుమాః యాసు పాలీషు = ప్రదేశేషు, తాసు ఖేలతీత్యర్థః । ప్రియకః పీతసారకే నీపే చిత్రమృగే చాలే ప్రియఙ్గావపి కుఙ్కుమే పిచేతి కోశః । బాలికాః కుఙ్కుమరచితపఙ్క్తి ప్రదేశేష్వాత్మీయ కల్పిత దేశేషు క్రీడనం (తొక్కుడుబిళ్ళ) క్రీడన్తి స్మ ఇయమపి బాల్యోచితక్రీడా పరాయణా సుఖేన కాలమ్ యాపయతీతి భావః ।

యద్వా ఆలీభిః = షట్పదైః, లసన్తః, ప్రియకాః = కదమ్బాః యాసు తాసు పాలీషు ఖేలతి । కదమ్బానామ్ లసత్త్వ భ్రమరత్వ కథనేన తేషాం పుష్పితత్వం, తదుపవనావాసితప్రదేశానామ్ హృద్యత్వం చ ద్యోత్యతే ॥

వస్తుతస్తు ప్రియకవద్వర్ణత్వాత్ ప్రియకః। కస్తూరిమృగవిశేషధారిత్వ ద్రః। ఆళీ = సఖీ, సైవ లసన్ ప్రియకః యాసు తాః ఆళిలసత్ప్రియకాః, తాదృశ్యశ్చ తాః పాళయః = పరిదేశాః చేతి కర్మధారయః, తాసు ఖేలతీత్యర్థః, ప్రియక ఇతి ప్రకారవచనే కన్ప్రత్యయః। ప్రకారతాయాః సాదృశ్యాత్మకత్వాత్ ప్రియవేషధారిత్వం లభ్యతే। జన్మాన్తరప్రియశఙ్కర విరహవేదనామసహమానా దేవీ తద్వేషధారిణీభిస్సఖీభిస్సంక్రీడమానా కాలం వినోదయతీతి భావః। ఏతేనాస్యాః పాతివ్రత్యం వ్యజ్యతే। ప్రతికృతిదర్శనాదయః విరహిణాం వినోదోపాయా ఇతి కామశాస్త్రప్రసిద్ధమ్। యద్వా ఆళీనామ్ = సఖీనాం యాః లసతః ప్రియకస్య = ప్రియస్య శివస్య, పాలయః = చిహ్నాని, తేషు ఖేలతి. తాదృశ చిహ్నవిషయక మనోవినోదవతీత్యర్థః। ప్రియచిహ్నానామపి విరహిజన వినోదోపాయత్వాదితి భావః। అత్ర తు ప్రియక ఇతి స్వార్థే కప్రత్యయాన్తః।

భవః = సంసారః, స ఏవ వ్యాళః = సర్పః. తస్య నకులీ। అత్ర భవదేవ్యోః సహజవిరుద్ధసర్పనకులత్వారోపేణ శాశ్వతికో బాధ్యబాధకభావస్సూచితః। యద్వా భవశ్శఙ్కరః తస్య యా వ్యాళ్యః = అలఙ్కారభూతాస్సర్పాః, తాసాం నకులీ "భవః క్షేమేశసంసారే సత్తాయాం ప్రాప్తి జన్మనో"రిత్యుభయత్రాపి కోశః' దేవ్యాం నకులత్వారోపాత్ భర్తృలఙ్కారసర్పాణాం సుదూర పలాయనం తద్ద్వారా అవ్యాహతం దాంపత్యసుఖం చ ప్రతీయతే॥

అసితాః = నీలాః, చూళీనాం = అలకానాం, భరాః సమూహాస్సా తథోక్తాః; భరశబ్దేన కచానాం సుదీర్ఘస్నిగ్ధత్వాద్యోత్యతే। తేన చ నిత్యసుమఙ్గళీత్వం జ్ఞాయతే। స్వతః నీలవర్ణే చూళీభరే అసితశబ్దప్రయోగః సార్వదికనీలత్వ బోధనద్వారా జరాద్యసంప్రాప్తిలక్షణమస్యాః నిత్యత్వమావిష్కరోతి। చరణయోర్యా ధూళీ తస్యాం తయా వా లసన్తః యే మునయః = మననశీలాః, తేషాం గణాః = సఙ్ఘాః యస్యాస్సా తథోక్తా। మననశీలానామపి ప్రక్షాళనం తత్పాదధూళ్యాలంబాదేవ ఉత తద్ధూళిప్రయోజ్యమేవేతి వాऽర్థః। నిరీహాణామృషిమునీనాం తత్పాదధూళిః ప్రక్షాళనం స్వతఏవ ప్రసాధయతీతి భావః।

అథవా చరణయోర్ధూళీం లాతీ=గృహ్ణాతీతి చరణధూళీలః యః సతః= పరమాత్మనః, మునయః = మననశీలాః. సల్లక్షణపరమాత్మమననశాలినస్తేషాం గణః సః యస్యాస్సా తథోక్తా। దేవీపాదధూళిగ్రహణాదేవసల్లక్షణపరమాత్మమననశాలిత్వమిత్యర్థః। ఏవంచ దేవీపాదధూళీరేవ పరమాత్మమననసమ్పాదికా సతీముక్తయే ప్రభవతీతిభావ

యా= కాళికా, అళిం=మధులిహంబి భర్తీత్యాళీభృత్ తస్మిన్ శ్రవసి= శ్రవణే తాళీదళం= తాళవృక్షపత్రఖణ్డం వహతి= అలఙ్కారత్వేనధత్తే। పురాఖలు సద్యోజాతతాళపత్రాణి నిర్మితకర్ణికాకారాణి ధార్యన్తే శ్రవణయోరితి ప్రసిద్ధిః। పదిన్యాస్తస్యాః శ్రవణయోర్మధు లిట్పాతో స్యాచితఏవ।

అథవా ఆళీనాం= మధుపానాం, భృతిః = భరణంయస్మిన్ తత్తాళీదళం శ్రవసి వహతీత్యపియుజ్యతే। సమ్భృతమధూనాం సద్యోజాతతాళీపత్రాణాం మధుపభరణం యుజ్యతఇత్యర్థః। సద్యోజాతతాళపత్రాణాం సువర్ణవర్ణత్వాత్ మధుపానామిన్ద్రనీలతుల్యత్వాచ్చ ఇన్ద్రనీలమణిఖచిత సువర్ణశ్రవణాభరణధారిణీవ శోభత ఇతిభావః।

యద్వా ఆళ్యాసఖ్యా భృతే= భ్రియమాణే ధ్రియమాణే శ్రవసీతి కర్మధారయః। అత్రభృతిశబ్దః భక్తిశబ్దవత్ కర్మసాధనః। తత్ర శ్రవసి దేవీ తాళీదళం వహతి। డుభృఞ్ ధారణపోషణయోరితి ధారణార్థకత్వాత్ కర్ణపాళీరక్షాభరణాయాళ్యాధృతే శ్రవసిదేవీ స్వయమేవతాళీదళాభరణం యోజయతీత్యర్థః॥

అథవా ఆళ్యాః= సఖ్యాః, భృతిః= ధారణం యస్య తత్తాళీదళం శ్రవసి వహతి। అనేనచ సఖీ తాళీదళం పార్వత్యాః కర్ణయోరలఙ్కరోతీత్యర్థః। పూర్వత్ర దేవీకృతమాభరణసంయోజనమత్రతుసఖీకృతం తదితి భేదః।

అలీకే= ఫాలదేశే, శోభత ఇత్యలీకశోభి, తిలకం యస్యాస్సా తథోక్తా। తిలకప్రకాశమానఫాలదేశేతిభావః। "అలీకమప్రియే ఫాలేవితథ" ఇతిహైమః। అలభూషణాదావిత్యస్మాత్ "అలీవేదయశ్చేతి కికన్నిపాత్యతే। కాళీ భ్రూకోదణ్డలక్షణలక్షితా పార్వతీ. మమ మనఃకర్ణ। స్వసాత్కః =

కాళ్యాః, పదేవనాళీకే= పద్మేతయోస్సేవనస్యవిధిః= విధానం తస్మిన్ శాలీకరోత్వితి సమ్బన్ధః। ఆత్మచరణసేవావిధానే మమ మనః నిపుణం కరోతు ఇతిప్రార్థనా।

అథవా స్వస్య= ఆత్మనః పదం= స్థానం, హృదయమిత్యర్థః ''స్వే జ్ఞాతావాత్మని స్వం త్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే, పదంవ్యవసితత్రాణ స్థానలక్ష్మాంఘ్రివస్తుషు'' త్యుభయత్రాప్యమరః। తదేవనాళీకం= కమలం, హృదయపుణ్డరీకమిత్యర్థః। తస్యసేవనం= అనుసన్ధానం, తస్యవిధిః విధానం। అత్ర హృత్పుణ్డరీకసేవనవిధిశబ్దేన తత్రసాక్షాత్కారానుసన్ధానమేవ వివక్షితం। ఏవం చాన్తర్ముఖస్సన్ హృత్పుణ్డరీకస్థాత్మానుసన్ధానే నిపుణో యథాస్యాం తథా కరోత్వితి ప్రార్థనా॥

అర్థము:- యా= ఏకాళికాదేవి. ఆళీభిః= చెలికత్తెలచేత, ఆత్త= పొందఁబడిన (పట్టుకొనఁబడిన) తనుః= శరీరముగలదై, ఆలీ= పంక్తులచే, లసత్= ప్రకాశించుచున్న, ప్రియక= కడిమిచెట్లుగల, పాళీషు= ప్రదేశములందు, ఖేలతి= ఆడుచున్నదో, (ఈశ్లోకమునందు చాలపదముల కనేకార్థములుగలవు, వివరణమును బట్టి యీయర్థములను దెలిసికొనుఁడుగాక) భవ= సంసారమనెడు వ్యాళీ= త్రాచుపామునకు, నకులీ= ముంగిసవంటిదో అసిత= నల్లనైన, చూళీ= ముంగురులయొక్క, భరా= బరువుగలదో, చరణ= పాదములందలి, ధూళీ= పరాగముచే, లసత్= ప్రకాశించుచున్న ముని= మననముచేయువారియొక్క, గణా= సముదాయముగలదో, యా= ఏకాళికాదేవి, ఆళీభృతి- చెలికత్తె చేపట్టుకొనఁబడిన, తాళీదళం= తాటియాకును, శ్రవసి= చెవియందు, వహతి= ధరించుచున్నదో, యా- ఏకాళికాదేవి. అళీక= నుదురునందు, శోభి= ప్రకాశించుచున్న, తిలకా= బొట్టుగలదో, సా= ఆకాళికాదేవి, మమ- నాయొక్క, మనః- మనస్సును, స్వ- తనయొక్క, పద- పాదములనెడు, నాళీక- పద్మములయొక్క, సేవన- సేవించుటయొక్క, విధా- పద్ధతియందు, శాలీకరోతు- సమర్థముగునదానినిగా చేయుఁగాక.

ఆంధ్రవివరణము:- కవి యీశ్లోకములో బ్రహ్మానందమునకు కారణభూతమయిన కాళికాపాదముల సేవించుటయందు సామర్థ్యమునిమ్మని దేవిని ప్రార్థించుచున్నాడు. తనకానందమునిచ్చు కాళికగూడ క్రీడానందాముల కాలముగడుపుచున్నదని కవివర్ణించుచున్నాడు. కాళీకాదేవి తనతో సంచరించు చెలికత్తెల భుజములమీఁద చేయివేసికొని, కడిమిచెట్ల పంక్తులు గల ప్రదేశములం దాడుకొనుచున్నది. అనగా సౌకుమార్యము, ఐశ్వర్యము గలది కనుక తోటలయందు తనదేహభారమును చెలికత్తెలపై నిడి యాడుచున్నదని భావము.

లేదా బాలికలు కుంకుమము మొదలగువానిచే చదరముగా గడులను నిర్మించి, వానియందు తొక్కుడుబిళ్లె మొదలగు నాటలనాడెడివారు. ఆ యాటలనాడుచు నీమె బాల్యమునందు కాలయాపనమును చేయుచున్నదని భావము.

లేదా చక్కగా వికసించి, తుమ్మెదలు వ్రాలుటచే నింపును గూర్చు కడిమిచెట్లుగల ప్రదేశములందు ఆడుకొనుచున్నది. అనగా ఆప్రదేశములు గూడ పరిమళించుటచే హృదయమునకు నింపునుగూర్చుచున్నవని భావము. లేదా తన చెలికత్తెలు కొందరు శివునివేషము ధరించిరి. మరికొందరు శంకరుని చిహ్నములను ధరించిరి. అట్టివేషధారిణులతోగూడి యాడుకొనుచున్నది. అనగా నీమె మహాపతివ్రతగనుక జన్మాంతరమందుగూడ అభర్తృచిహ్నవేషముల నేకోరి యాడుచున్నదనియు. ఆభర్తృవేషముతోడను, చిహ్నములతోడను జన్మాంతరమందలి భర్తృవిరహవేదనను పోగొట్టుకొనుచున్నదనియుభావము. విరహముగలవారికి తమభర్తృచిహ్నములుగాని ప్రతిబింబముగాని కనుపించినచో విరహవేదనలు తగ్గునని కామశాస్త్రప్రసిద్ధము.

కాళికాదేవి సంసారమనెడు త్రాచుపామునకు ముంగివంటిది. అనగా ముంగినిచూచుసరికి త్రాచుపాము తనంతటతానే వెనుకకు తొలగిపోవునట్లు పార్వతీదర్శనమగుసరికి భక్తులసంసారము స్వయముగనే నివర్తించునని భావము.

ఇట్లు చెప్పుటచే కాళికాదేవికిని, భక్తుల సంసారములకును సహజవైరమును
కాళికచే సంసారము బాధింపబడి పోవుటయు వెల్లడియగుచున్నది. లేదా
శంకరుండు పాముల నలంకారముగ ధరించెను. ఆశంకరుని కాళీదేవి వివాహ
మాడెను. ఆశంకరాభరణసర్పములకు ఈమె యాగివంటిది. అనగా
పతిభోగావసరములందు సమీపించిన కాళికనుజూచి పాములు దూరముగ
పారిపోవుచున్నవి. కనుకనె వారిదాంపత్యసుఖము విఘ్నములు లేక జరు
గుచున్నదనియు భావము. ఈమె నల్లనైన పెద్దజుట్టు గలది కనుక దీర్ఘ
సుమంగళియని తెలియవలెను. నల్లనిజుట్టుగలది అనగా ఈమెకు ఎప్పుడును
ముదుసలితనమువచ్చి జుట్టు తెల్లబడుట జరుగదనియు దేవత్వము గలదనియు
తెలియుచున్నది. ఈకాళికాదేవి పాదములందలి ధూళిచే మునీశ్వరులు
గూడ ప్రకాశించుచున్నారు. అనగా లోకమందలి భోగ్యవస్తువులం
దాసమాని పరమాత్మను ధ్యానించు మహామునులకు గూడ భక్తితో
పూజించిన కాళికాపాదధూళి యానందము నిచ్చుచున్నదనియు, దీనిచే
జ్ఞానులకుగూడ సగుణోపాసన మానందదాయక మగుచున్నదనియు భావము.
ఈమె పాదసేవవలనపరమాత్మానుసంధానశక్తిగూడ కలుగునని విశేషమును
గ్రహింపవలెను. పూర్వకాలమందు స్త్రీలు లేతతాటియాకులను దుద్దులవలె
చేసి వానిని చెవితమ్మెలయందు అలంకారముగా ధరించెడివారు, ఈపార్వతి
గూడ అట్టితాటియాకుల దుద్దులను ధరించినది, అదిగాక పద్మినీజాతిదగు
పార్వతిచెవియందు తుమ్మెదలుగూడ వ్రాలినవి, లేదా తుమ్మెదలతోగూడిన
లేతతాటియాకుల దుద్దులను ధరించినదనియు చెప్పవచ్చును, అనగా లేత
తాటియాకులు బంగారురంగుకలవగుటచేతను, తుమ్మెదలు ఇంద్రనీలమణుల
వలె నల్లగ నుండుటచేతను, ఇంద్రనీలమణులను పొదిగిన బంగారుదుద్దులను
ధరించినదా యనునట్లుండెనని భావము, లేదా చెలికత్తె పార్వతి చెవితమ్మె
రంధ్రమును పెద్దదిచేసి పట్టుకొనగా కాళికయే స్వయముగ తాటియాకుల

ముద్దును ధరించినదని చెప్పవచ్చును. లేదా పార్వతీదేవి చెవియందు తాటాకు దుద్దును చెలికత్తెయే యాభరణముగ నుంచుచున్నదనియు చెప్పవచ్చును. చక్కగా తిలకమును ధరించుటచే నందముగా ప్రకాశించు నుదుటిభాగముగలదియు నగు పార్వతీదేవి నామనస్సును తనపాదపద్మసేవ చేయుటయందు నేర్పుగలదానినిగా జేయుగాక! లేదా హృదయపద్మమందలి ఆత్మానుసంధానము చేయుశక్తిని నామనస్సున కిచ్చుగాకయని ప్రార్థించుచున్నాడు.



శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః

షష్ఠః శ్లోకః

బాలామృతాంశు నిభఫాలా మనాగరుణచేలా నితమ్బఫలకే
కోలాహలక్షపిత కాలా మరాకుశలకీలాలశోషణరవిః।
స్థూలాకుచే జలదనీలా కచే కలితలీలా కదమ్బవిపినే
శూలాయుధప్రణతిశీలా దధాతు హృది శైలాధిరాజతనయా॥

బు ధ తో షి ణీ

భగవత్యా ఉపాసనాయోగ్యం రూపసౌన్దర్యం నిర్దిశతి బాలేతి॥ అమృతమయాః అంశవః యస్య స అమృతాంశుశ్చన్ద్రః । బాలశ్చాసావమృతాంశు శ్చేతి కర్మధారయః। తేన సదృశః = తన్నిభః, ఫాలః యస్యాస్సా తథోక్తా । "నిభసఙ్కాశనీకాశ ప్రతీకాశోపమాదయః" ఇతి కోశాత్సాదృశ్యార్థకత్వం నిభశబ్దస్య । అస్యపదవిగ్రహాశ్చ । యథా చన్ద్రదర్శనేన జనః ప్రసన్నం సదా సుఖమనుభవతి తద్వదేవ దేవీముఖదర్శనేనేతి భావః । నితమ్బఫలక ఇవేత్యుపమితసమాసః । తస్మిన్, మనాక్ = ఈషత్, అరుణచేలమ్ యస్యాస్సా తథోక్తా । రక్తామ్బరపరిధానేత్యర్థః । కోలాహలేన = కలకలేన, క్షపితః = నాశితః, కాలః = మృత్యుః యయా యా సా తథోక్తా సకలజీవహానికారిణః యమస్యాపి కలకలమాత్రేణైవ నియన్త్రీత్యర్థః । అనేన చాస్యా మహామహిమాన్వితత్వం లోకపాలనియన్త్రీత్వంచ గమ్యతే । న మ్రియన్త ఇత్యమరాః = దేవాః. తేషాం యదకుశలమ్ । కుశలాన్యతా, అత్రా ధర్మ ఇత్యాదావివనఞో ఽన్యార్థకత్వం । క్షేమహానిరితి భావః । తదేవకీలాలమ్= జలమ్, "కీలాలంరుధిరేతోయే" ఇతి హైమః । తస్య శోషణేరవిః = సూర్యః । యథా సవితా జలశోషకః ఏవమేవ కాళ్యపి దేవశత్రుకృత క్షేమహానిశోషికేతి

భావః । జలశోషక సూర్యోపమానేన స్వస్థానస్థైవ సా సకలదేవతానాం క్షేమ హానిం నాశయతి, యథా సూర్యస్య జలశోషకత్వం నైసర్గికం తద్వద్దేవ్యాస్సా అపి సురక్షేమహాని నాశకత్వమితి జ్ఞేయమ్ । యథా జలశోషణమూలకవర్షో త్పాదనద్వారా ఆదిత్యః సకలలోకోపకారకః తథైవ లోకపాలకదేవక్షేమ హాని నాశనద్వారా సకలజగదుపకారిణీ దేవీతి ద్యోత్యతే । కుచేస్థూలా పృథుల స్తనభరయుతేత్యర్థః । కుచాంశే స్థౌల్యవర్ణనేన అన్యత్ర కృశేతి గమ్యతే । తథా చ తన్వఙ్గీతి భావః । కచే = శిరోజభారే, జాత్యేకవచనమ్ । జలందదాతీతి జలదః = మేఘః । స ఇవ నీలా । వర్షాకాలమేఘసదృశనీలకచకలాపేత్యర్థః । స్వతో నీలవర్ణాయాః దేవ్యాః కచాంశే జలదసదృశనీలత్వవర్ణనాదత్యన్తనైల్యం కచేషు ప్రతీయతే । కదమ్బానామ్. విపినే = వనే । కలితాః = అనుభూతాః, లీలాః యయా సా తథోక్తా । కదమ్బవనే విహారణక్రీడాది విలాసపరాయణే త్యర్థః । శూలమాయుధమ్ యస్య స శూలాయుధః — శఙ్కరః । తముద్దిశ్య కృతాః ప్రణతయః = నమస్కారాః శీలమ్ = స్వభావః యస్యాస్సా తథోక్తా । కాళికా స్వభావేనైవ శివం నమస్కరోతి నతు ఫలానుసన్ధానేనేతి నిష్కామత్వం సూచ్యతే । శూలాయుధప్రణతిశీలేత్యనేన కేవలం ప్రణయావస్థా యాం కిన్తు సర్వావస్థాస్వపి భర్తృసాహచర్య పారతన్త్ర్యసముపేతేతి గమ్యతే ఏవం చ లోకోత్తరం పాతివ్రత్యమస్యాః ప్రకటితం భవతి । ఏతాదృశలక్షణలక్షితా. శైలాధిరాజస్య = హిమవతః తనయా = పుత్రీ పార్వతీ, హృది, మమేతి శేషః । దధాతు = నివాసం కరోతు, ఇతి ప్రార్థనా । కర్మణోఽవివక్షిత త్వేన సకర్మకస్యాపి దాధాతోరకర్మకత్వేన ప్రయోగః । అత్ర కుచ కచ యోః స్థౌల్యాతినైల్యవర్ణనేన అన్యత్ర తనుత్వాతినీలత్వబోధనాత్ . కదమ్బ విపినే కలితలీలేత్యనేన చేష్టావిశేషబోధనాచ్చ ఉపాసనాయోగ్యతయా దేవ్యాః ఆకృతి- వర్ణ- చేష్టా- విశేషాః నిర్దిష్టా ఇతి బోధ్యమ్ ॥

అర్థము:- బాల = లేతవాఁడైన (అనగా: ఉపమానమునుబట్టి అష్టమినాఁటి చంద్రునివంటి) అమృత + అంశు = చంద్రునితోఁ, నిభ = సమానమయిన, ఫాలా = నుదురుగలదియు, నితమ్బ + ఫలకే = పలకవలె బల్లపరుపుగానున్న పిరుదులందు మనాక్ = కొంచెము, అరుణ = ఎఱ్ఱనైన, చేలా = వస్త్రములదియు, కోలాహల = కలకలధ్వనిచేత (హుంకారముచే) క్షపిత = నశింపఁజేయఁబడిన, కాలా = మృత్యువుగలదియు, అమర = దేవతలయొక్క, అకుశల = క్షేమముగా నుండకపోవుటయను, కీలాల = నీళ్ళయొక్క, శోషణ = ఎండింపఁజేయుటయందు, రవిః = సూర్యునివంటిదియు, కుచే = స్తనములయందు, స్థూలా = బలిసినదియు, కచే = జుట్టునందు, జలద = మేఘములవలె, నీలా = నల్లనయినదియు, కదమ్బ = కడిమిచెట్లయొక్క, విపినే = అడవియందు, కలిత = కూడుకొనిన, లీలా = విలాసలుగలదియు, శూల + ఆయుధ = శూలాయుధ = శూలమే ఆయుధముగాగల శివునకు, ప్రణతి = నమస్కరించుట, శీలా = స్వభావముగాగలదియు నగు, శైలాధిరాజ = హిమవంతునియొక్క, తనయా = కూతురయిన పార్వతీదేవి, హృది = నామనస్సునందు, దధాతు = నివసించియుండుగాక.

ఆంధ్రవివరణము:- ఈశ్లోకమునందు ఉపాసన కనుకూలమయిన, కాళికాదేవియొక్క స్థూలస్వరూపమును వర్ణించుచున్నాఁడు. అష్టమినాటి చంద్రుఁడువలె వర్తులమై చూచువారి కానందమునుగొల్పు నుదురుగలదియు, పలకవలె బల్లపరుపుగా విశాలమగు పిరుదులందు కొంచెము ఎఱ్ఱనివస్త్రమును ధరించినదియు, లోకములోని సకలజీవుల ప్రాణములను హరించువాఁడు యమధర్మరాజు. అతనికి దండము, పాశము [illegible] కలవు. ఎట్టివారైన నా పాశములను [illegible] హుంకారముచేతనే యట్టియమునిగూడ నశింపఁజేయుగల [illegible]

అనగా శివభక్తులకు మృత్యుభయమును బోగొట్టి ముక్తినీయగలదియని భావము.
దేవతలు మృత్యువులేనివారైనను రాక్షసులు పెట్టు బాధలననుభవించుచు
దుఃఖించుచున్నారు. అట్టి దేవతలబాధలను సూర్యుడు నీళ్ళను ఎండింప
జేసినట్లు పోగొట్టు సామర్థ్యముగలదియు, సూర్యునకు జలశోషణచేయుమని
యెవరి ప్రేరణయులేదు. అట్లే యీమె దేవతలకు గల్గిన బాధలను పోగొట్టు
టకెవరి ప్రేరణయునక్కఱలేదనియు తనస్థానమునందుండియే వారి బాధలబోగొట్టు
నైజముగలదనియు భావము. సూర్యుడు జలశోషణమును జేసి వర్షమును
కలిగించి లోకోపకారమును జేయునట్లు దేవతల హానిని బోగొట్టి, వారి
ద్వారా సకలలోకములను పాలింపజేయుచు దేవి లోకోపకారమును జేయు
చున్నదనియు భావము. ఇట్లు చెప్పుటచే నీమెకు భక్తవాత్సల్య మెంత
యున్నదియు తెలియుచున్నది. అదిగాక దేవతలయినను తమబాధల
బోగొట్టుకొనుటకు దేవి నాశ్రయింపవలసినదే కాని గత్యంతరము లేదనియు
తేలుచున్నది. ఇక్కడ దేవతలనగా శివకేశవాదులనుగూడ గ్రహించవలెను.
ఏమనగా? శివుడు శక్తితో కలియకపోయినచో కదలనేలేడు. శ్రీమన్నారా
యణుడుగూడ మధుకైటభసంహారకాలమందు ఈమెనుపాసనజేసి శక్తిని
సంపాదించుకొని యాబాధను పోగొట్టుకొనెనని పురాణములు బోధించు
చున్నవి. సకలలోకజనని గావున పిపీలికాది బ్రహ్మపర్యంతముండు
సకలప్రాణిపోషకములయిన స్థూలస్తనములు గలదియు, సకలజనసమ్మోహ
కముఅయిన నల్లనిజుట్టుగలదియు అనగా మిగిలిన శరీరమున తనుత్వముగల
దనియు, శరీరమున జుట్టునందున్నంత నలుపు లేదనియు తోచుచున్నది.
కడిమితోటలందు క్రీడించుచు విహరించుచున్నదనియు, శూలమునుఆయుధ
ముగా ధరించిన శంకరునకు నమస్కారము చేయునట్టి స్వభావముగలదియు
అనగా అన్యోన్యప్రేమావస్థలయందే కాక సర్వకాల సర్వావస్థలయందును

భర్తృసేవాపరాయణురాలనియు దానిచే లోకోత్తరపాతివ్రత్యము గలదనియు భావము. ఇట్టిలక్షణములు కల హిమవంతునికూతురగు పార్వతీదేవి నాహృదయమందు నివసించియుండుగాక. మొత్తము భక్తులు ఉపాసించుటకు తగిన దేవియొక్క సగుణస్వరూప మీవిధముగ నున్నదని గ్రహించి ధ్యానించవలెను. అష్టమిచంద్రునివంటి మోముగలది, గులాబి రంగువలె లేతఎరుపుగల వస్త్రమును ధరించినది, స్థూలమగు స్తనములు గలది, సూక్ష్మమగు నవయవములుగలది, ఎక్కువ నల్లనైన జుట్టుగలది, కడిమితోటలం దాడుకొనునది, శివునకు నమస్కరించునది యగుపార్వతి ధ్యానించుటకు తగినదని కని భావము.

---

శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః

## పఞ్చమః శ్లోకః

కమ్బావతీవ సవిడమ్బా గళేన నవతుమ్బాఙ్గవీణసవిధా
బిమ్బాధరా వినతశమ్బాయుధాదినికురుమ్బా కదమ్బవిపినే
అమ్బా కురఙ్గమదజమ్బాలరోచి రిహ లమ్బాలకా దిశతు మే
శ మ్బాహులేయశశిబిమ్బాభిరామముఖసమ్బాధితా స్తనభరా॥

## బుధతోషిణీ

మాతృవదియమపి మాం సుతనిర్విశేషం సుఖాదిదానేన రక్షత్వితి ప్రార్థయతి కమ్బేతి॥ కదమ్బవిపినే, వర్తమానేతి శేషః, అమ్బా = జననీ, కాళికా, మే = మహ్యం, శం = సుఖం, శాశ్వత మిత్యర్థః । తస్యైవ ప్రార్థనీయత్వాత్ । దిశతు = దదాత్విత్యన్వయః ॥ అనేన ప్రార్థనేన దుఃఖనివృత్తి ర్నాన్తరీయకతయా గమ్యతే। కీదృశీతిచేత్? । గళేన = కణ్ఠస్వరూపేణ, కమ్బా = శఙ్ఖవిషయే, అతీవ = అత్యన్తం, సవిడమ్బా = సస్పర్ధా, అభిభూతకమ్బుకణ్ఠేత్యర్థః । "కమ్బుసదృశాకారకణ్ఠేన రాజ్యప్రాప్తి" రితి సాముద్రికశాస్త్రా దస్యా అభిభూతకమ్బుకణ్ఠత్వప్రతిపాదనేన సర్వలోకాధిరాజ్ఞీత్వం గమ్యతే ॥ కమ్బువిషయే సస్పర్ధే త్యనేన ఉపమానాత్కమ్బో రపి ఉపమేయస్య కణ్ఠ స్యాధిక్యవర్ణనా ద్వ్యతిరేకాలఙ్కారో వ్యజ్యతే। గళశబ్దః కాకాక్షిన్యాయే నోభయత్రాన్వయిత్వేన గళేన, తుమ్బం = వర్తులాలాబూఫలం, అఙ్గం = అవయవః యస్యాస్సా తుమ్బాఙ్గా, తాదృశీ వీణా, తయా సవిధా = సదృశా 'అలాబూస్తు వీణాఫలా తుమ్బి స్తుమ్బా మహాఫలా । తుమ్బాతు వర్తులాలాబూ ర్నిష్ప్ర చూర్ణా మహాఫలా" ఇతి వాచస్పతిః । అత్ర గళశబ్దేన కణ్ఠస్థో ధ్వని ర్లక్ష్యతే । ఏవం చ వీణాధ్వనిసదృశః అస్యాః కణ్ఠధ్వని రితి భావః । అత్ర 'వీణ' ఇత్యనాజన్తప్రయోగో మృగ్యః । తుమ్బాఫలసహితత్వం

పీనాయాః శ్రేష్ఠత్వద్యోతనాయ । ఏతేన చాస్యాః లాలనసామర్థ్యం ద్యోత్యతే। లోకే మాతౄణాం మధురగానేన రుదద్బాలకలాలనస్య ప్రసిద్ధత్వాత్ । బిమ్బమ్ = బిమ్బికాఫలం "బిమ్బస్తు ప్రతిబిమ్బే స్యాన్మణ్డలే బిమ్బికాఫలే" ఇతి హైమః తద్వదరుణః సుకుమారశ్చ అధరః = అధరోష్ఠః యస్యాః సా తథోక్తా ॥ అధరస్య బిమ్బసాదృశ్యవర్ణనేన సౌభాగ్యం గమ్యతే। శమ్బః = వజ్రం, ఆయుధం=ప్రహరణసాధనం యస్య స శమ్బాయుధః = ఇన్ద్రః, "శమ్బ స్తు ముసలాగ్రస్థలోహమణ్డలకే పవౌ" ఇతి నానార్థరత్నమాలా । స ఆది ర్యేషాం తే దేవాః వినతాః=ప్రహ్వీభూతాశ్చ తే శంభాయుధాదయశ్చేతి కర్మధారయః తేషాం దేవానాం నికురమ్బః = సమూహః= యస్యాః సా తథోక్తా।అమోఘాయుధసాధనా అపి లోకపాలాదయో దేవా అస్యా అగ్రే ప్రహ్వీభూతా ఇత్యర్థః । అస్యాః కరుణాకటాక్షపాతాదేవ లోకపాలకాయుధానామమోఘత్వం లోకసంరక్షకత్వాదికం చ లభ్యత ఇతి భావః । కురఙ్గాః = మృగాః. తేషాం యః మదః, స ఏవ జమ్బాలః= పఙ్క— ఇతి రూపకం । తస్య రోచిః = సూర్యకిరణభూతా । యథా ఆదిత్యకిరణాః పఙ్కం నాశయన్తి ఏవ మేషాపి సహజనేత్రసౌభాగ్యేన సర్వమృగావలేకం నాశయతీతి భావః । లమ్బాః, అలకాః = చూర్ణకున్తలాః యస్యాః సా తథోక్తా । అఙ్గనానాం దీర్ఘకున్తలత్వ మతీవ సౌభాగ్యప్రదమితి సాముద్రికశాస్త్రప్రసిద్ధం । బహులాః = కృత్తికాః "బహులా నీలికాయాం స్యా ద్దేలాయాం గవి యోషితి । కృత్తికాసు స్త్రియాం భూమ్ని విహాయసి నపుంసక" మితి మేదినీ । తా అస్యాం పౌర్ణమాస్యాం సన్తీతి బాహులీ తస్యాం జాతో బాహులేయః । స్త్రీభ్యో ఢక్ । బాహులేయః యః శశీ తస్య యద్బిమ్బం = మణ్డలం, తద్వదభిరామం చ తన్ముఖ మితి కర్మధారయః । సమ్బాధితౌ = అన్యోన్యముత్పీడయన్తౌ, స్తనౌ = కుచౌ సమ్బాధితస్తనౌ, తయోః భరః, బాహులేయశశిబిమ్బాభిరామముఖం, సమ్బాధితస్తనభరః యస్యాః సా తథోక్తా। విలసచ్చారదచన్ద్రబిమ్బస్యపరిణతచన్ద్రికావత్త్వేన

సర్వజనాహ్లాదిత్వవత్ దేవి ముఖస్య సర్వభక్తజనాహ్లాదిత్వ మితి జ్ఞేయం॥ దుఃఖబహులే౽స్మిన్ సంసారే సఞ్చరతాం, భక్తానాం దేవీముఖ మానన్ద సన్దాయక మితి భావః సమ్బాధితస్తనభరేత్యనేన మాతృత్వ త్సర్వలోకపోషణ సమర్థేతి గమ్యతే। ఏతాదృశీ అమ్బా, ఇహ = అస్మిన్ సంసారే మనుష్య జన్మని వా। అత్ర మనుజజన్మనః సుఖదుఃఖసమ్మిశ్రితత్వద్యోతనాయ సుఖస్యై వావశ్యప్రార్థనీయత్వద్యోతనాయ చ ఇహ శబ్దప్రయోగః। మే, శం, దిశ త్విత్యన్వయః। అత్ర దుఃఖనివృత్తిపూర్వక శాశ్వతసుఖస్యైవ కవి సంరమ్భగోచ రత్వేన దివ్యత్వం వినా తదప్రాప్తేరియం ప్రార్థనా దివ్యత్వపర్యవసాయి నీతి బోధ్యం స్వజన్మనిదానభూతాయా మాతు 'స్సుత్వేపి దేవ్యా మమ్బా గ్రహణం శాశ్వతసుఖప్రదతయా ఇయమేవ వస్తుత అమ్బేతి ద్యోతయతి.

అర్థము:—కదమ్బ + విపినే = కడిమితోటయందు (ఉన్నట్టి) అమ్బా = తల్లియైన పార్వతీదేవి, మే = నాకొఱకు, శం = శాశ్వతసుఖ మును, ఇహ = ఈమనుష్యజన్మమునందు, దిశతు = ఇచ్చుగాక, (తల్లి యైన పార్వతీదేవి యెట్టిదనగా?) గళేన = కంఠస్వరూపముచేత, కమ్బౌ = శంఖము విషయమందు, అతీవ = మిక్కిలి, సవిడమ్బా = తిరస్కారముతో గూడినదియు, గళేన = కంఠధ్వనితో, నవ = క్రొత్తదయిన, తుంబ + అంగ = గుండ్రనిపెద్దసొరకాయ అవయవము గాఁగల, వీణా = వీణాధ్వనితో సవిధా = సమానమయినదియు, బింబ = దొండపండువంటి, అధరా = క్రిందిపెదవిగలదియు, వినత = వంగినమస్కరించిన, శంబ + ఆయుధ = వజ్రము ఆయుధముగాఁగల దేవేంద్రుఁడు, ఆది = మొదలుగాఁగల దేవతల యొక్క, నికురుంబా = సముదాయముగలదియు, కురంగ = లేళ్ళయొక్క, మద = గర్వమునెడు, జంబాల = బురదకు, రోచిః = సూర్యకిరణమువంటి దియు, లంబ = వ్రేలాడుచున్న, అలకా = ముంగురులుకలదియు। బాహు లేయ = కార్తికమాసమందలి, శశి + బింబ = చంద్రమండలమువలె. అభి రామ = మనోహరమయిన, ముఖ = ముఖమును, సంబాధిత = ఒకదానితో

నొకటి యొరిపిడిచేయుచున్న, స్తన= స్తనములయొక్క, భరా= బరువును కలదియు, అగు పార్వతి నాకీజన్మమునందు శాశ్వతసుఖము నిచ్చుగాక యని కవి ప్రార్థనము.

ఆంధ్రవివరణము:—తల్లివలె నీమె నన్ను పుత్రునిగా జూచి సౌఖ్యము కలుగునట్లు రక్షించుగాకయనికవి ప్రార్థించుచున్నాడు. శంఖమునుగూడ తిరస్కరించునంత సెక్కుడందమయిన కంఠముగలదియు, సారకాయగల వీణాధ్వనితో సమానమయిన కంఠధ్వనిగలదియు, దొండ పండువలె నెఱ్ఱనయి సుకుమారమయిన క్రిందిపెదవిగలదియు నగు నీమెకు వజ్రాయుధము ధరించిన యింద్రుఁడు మొదలగు దేవతలుగూడ నమస్కరించుచున్నారు. అనగా అమోఘాయుధముల ధరించినవారయినను దేవతలు దేవికి నమస్కరించినగాని లోకపాలనశక్తి లేనివారనియు, ఈమెద్వారా సర్వశక్తులను పొందుచున్నారనియు భావము. విశాలములై చంచలములై మనోరంజకములయిన నేత్రములు మనకుగాని లోకములో నింకెవరికిని లేవని లేళ్ళు గర్వించుచున్నవి. ఈకాళికాదేవి నేత్రముల సొగసును జూచువరికి ఆలేళ్ళయొక్క గర్వమంతయు నశించిపోయినది, లోకములో నుపమానము లుగానున్న లేడికన్నులకన్న నుపమేయములగు నీమెకన్నులు ఎక్కువ యందములుగా నున్నవనుటచే వ్యతిరేకాలంకారము సూచింపబడుచున్నది. ఈమె వ్రేలాడుచున్న జుట్టుగలది. "దీర్ఘకేశి చిరసౌభాగ్యవతి యగు"నని సాముద్రికశాస్త్రప్రసిద్ధము, కార్తీకమాసమందలి చంద్రబింబము చక్కని వెన్నెలలచే సందరిమనస్సుల నాకర్షించును. అట్టిచంద్రబింబమువంటి ముఖమును, ఒకదానినొకటి యొరిపిడి చేసుకొనుచున్న స్తనములును, గల ఓ తల్లీ నాకీజన్మమందు శాశ్వతసుఖమునిచ్చి కాపాడుమని కవి ప్రార్థించు చున్నాడు. 'కంఠము శంఖమువలె నున్నచో రాజ్యప్రాప్తి'యనిసాముద్రి కశాస్త్రముచెప్పుచున్నది. అంతకంటె నెక్కువ యందముగా నున్నదనుటచే

సర్వలోకములకును నీవు రాణియనుభావము తోచుచున్నది. ఈపద్యమందు "అంబా, సంబాధిత స్తనభరా, గళేన నవతుమ్బాబడ్జ్ఞణసవిధా, శం. మే. దిశతు" అను ప్రార్థనవాక్యములవలన నీక్రిందిభావములు తోచుచున్నవి, కాళికాదేవి తల్లివంటిదికనుక తల్లి యెట్లు తనకుమారుడు అడుగకపోయినను పరుండియున్నను స్వయముగ నేలేపి క్షీరములనిచ్చి, చక్కగ పాటలపాడి సుఖమును కలిగింపజేయునో: ఒకప్పుడు తల్లి కార్యాంతరాసక్తిచే నూరకున్నచో బాలుడు రోదనముజేయగా నది విని యెట్లు వానినోదార్చునో యట్లే యోతల్లీ! లోకమాతే కుటుంబముగాగల నీవు మహాత్ములను కాపాడుచు, సంసారబాధల ననుభవింపలేక దుఃఖపడుచున్న నన్ను విడచిపెట్టవద్దనియు బాలుడువలె నజ్ఞానినయిన నన్ను రక్షించుటకు తగినవస్తువులు, చక్కని కంఠధ్వనియు కలదానవనియు భావము. "పుణ్యపాపాభ్యాం మనుష్య జన్మ" అనుశాస్త్రముచే ప్రతిమనుష్యునకు పుణ్యపాపములును, వానిచే కలుగుసుఖదుఃఖములును సహజములనియు, వానిలో దుఃఖములనుబోగొట్టి శాశ్వతసుఖముల నిమ్మనియు కవిభావము. అనగా శాశ్వతసుఖము దేవత్వము వలన గలుగును కావున దేవత్వమును గోరుచున్నాడని తెలియవలెను. ఇది గాక, స్వశరీరకారణభూతురాలయిన తల్లియున్నను దేవినే తల్లిగా భావించి శాశ్వతసుఖమును పొందగోరెననియు, ఈతల్లియే యట్టిసామర్థ్యము గల దనియు కవి యుద్దేశము.

---

శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః.

## షష్ఠః శ్లోకః

**దా**సాయమానసుమహాసా కదమ్బవనవాసా కుసుమ్భసుమనో
వాసా **వి**పఞ్చీకృతరాసా విధూతమధుమాసా రవిన్దమధురా
కాసారసూనతతిభాసా ఽభిరామతను రాసారశీతకరుణా
నాసామణి ప్రవరభాసా శివా తిమిర మాసాదయే దుపరతిమ్॥

## బుధతోషిణీ

అనాదికర్మవాసనా వాసిత స్యాజ్ఞానాన్ధకారనివారణం ప్రార్థయతి దాసాయమానేతి॥ దాస ఇవ ఆచరన్తీతి దాసాయమానాని, తాదృశానాం సుమానాం = పుష్పాణాం, హాసః = వికసనం, సుమహాసః యస్యాస్సాతథోక్తా। హాసస్యకుసుమవికాసౌపమ్యం కవిసమయసిద్ధం। అత్రోపమాన భూతకుసుమవికసనస్య దాస్యాఙ్గీకారవర్ణనా దుపమేయస్య అధిక్యం వ్యజ్యత ఇతి వ్యతిరేకాలఙ్కారో భవతి। కాదాచిత్క- భఙ్గుర- సాపేక్ష- కుసుమవికసనస్య అతథావిధ (సార్వకాలికా- భఙ్గుర- నిరపేక్ష) ఉత్కృష్ట గుణావాప్తయే దేవీహాస దాస్యాఙ్గీకారః సఙ్గచ్ఛతే। దాసాయమానపదేనకుసుమదాస్యేదేవ్యాస్సమ్మతిరప్యస్తీతి, తేనదేవ్యాః జడానుకమ్పయా లోకోత్తరదయాశీలతాచ గమ్యతే। కదమ్బానాం వనేవాసః యస్యాస్సా తథోక్తా। అనేనస్వ ప్రియావాస పరివేశాదాహ్లాదాతిశయ స్తేన ఆశ్రితాభీష్ట ప్రదానౌత్సుక్యంచ ప్రతీయతే। కుసుమ్భస్య = హిరణ్యస్య, సుమనః = పుష్పం (పద్మం) తస్మిన్వసతీతి తథోక్తా। సౌవర్ణపఙ్కజవాసినీత్యర్థః। అథవా కుసుమ్భః = కమణ్డలుః, తదుపలక్షితాః యే, సుమనసః = దేవాః, తేషాం వాసః = నివాసః, యస్యాంసాతథోక్తా। తన్నివాసభూమిః తద్గమ్యస్థానం వేత్యర్థః, "కుసుమ్భం హేమని మహారజనే నా కమణ్డలౌ" ఇత్యుభయత్రాపి మేదినీ। "యథేహకర్మచితో లోకః క్షీయతే తథాముత్రపుణ్యచితో లోకః" ఇతిశ్రుతి

సాక్యాత్మ్యేన స్వనివాసస్య భద్రపీఠత్వం పక్ష్యన్తః శాశ్వతికత్వమపేక్ష్య మాణా దేవాః కమణ్డల్వాది ధారణేన సనియమాః దేవీ ముపాసన్త ఇతిభావః। ఏవంచ దేవ్యుపాసనాదేవ జన్మాన్తర రాహిత్యరూపముక్తిరితి విజ్ఞాయతే। చరమజన్మని శ్రీ విద్యోపాసకో భవే దిత్యాద్యుపపత్తిమాహాత్మ్యాత్। రస ఏవ రాసః, ప్రజ్ఞాదిత్వాత్స్వార్థే ణ్, విపఞ్చ్యాం కృతః రాసః = అనురాగః యస్యాస్సా తథోక్తా “శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే రసః” ఇత్యమరః। వీణాగానలోలుపేత్యర్థః। రాసశబ్దేన తదాఖ్యక్రీడాగ్రహణేతు విపఞ్చీమనుసృత్య కృతః రాసః క్రీడావిశేషః యస్యాస్సా తథోక్తా। రాసో నామానేకప్రకారానుసృతం నాట్యం। తత్ర సక్తా యా విపఞ్చీ ధ్వన్యతే తదనుసారీ రాసః అనయా క్రియత ఇత్యర్థః। అనేనచ దేవీరాసస్య సౌకుమార్యం లోకాతిశాయిత్వంచ గమ్యతే। విఘూతం = తిరస్కృతం, మధుమాసే = చైత్రమాసే, యదరవిన్దమ్ = పద్మమ్ తస్య మధురం = మాధుర్యం యస్యాస్సా తథోక్తా। చైత్రమాసారవిన్దే సర్వజనవశీకరణ సమర్థం మాధుర్యం ప్రసిద్ధం। తదభిభవసమర్థ మాధుర్యోపేతేత్యర్థః। ఏతేనచ దేవ్యా లోకోత్తర వశీకరణ సామర్థ్యం స్ఫుటీకృతం భవతి। అథవా మధు = మకరన్దం రాతిగృహ్ణాతీతి మధురః = భ్రమరః। విఘూతః - నిష్కాసితః, మధుమాసారవిన్దే మధురః యయా సా తథోక్తా। విలాసధృతపద్మజాలేన నిష్కాసితభ్రమరవతీతి ప్రకృతివర్ణనపరమిదమ్। యద్వా విఘూతం = కమ్పితం, మధుమాసారవిన్దం। యేనస విఘూత మధుమాసారవిన్దః, తాదృశః మధురః = నర్మకః యస్యాం సా తథోక్తా మధుపాః చైత్రారవిన్దం విధూయ సౌగన్ధ్యాతిశయ సమ్పన్నామేనాం పద్మినీమాశ్రయన్తీత్యర్థః। కాసారే యాని సూనాని = పుష్పాణి, పద్మాదీనీత్యర్థః తేషాం యా తతిః = సముదాయః తస్యాః భాసా = కాన్త్యా। అభిరామా = మనోహరా, తనుః = శరీరం యస్యాస్సా తథోక్తా। ధృతారవిన్దమాలా సుమనోమనోహరాఙ్గీతి భావః। ఆసారః = ధారావృష్టిః, తద్వచ్ఛితా, కరుణా = దయా యస్యాస్సా తథోక్తా। ధారావృష్ట్యౌపమ్యేన దేవీకరుణాయా అన్నోత్పత్తిద్వారా ప్రజాహేతుత్వం, తాపనివారకత్వం సార్వత్రిత్వం అప్రార్థితోపనతత్వంచ గమ్యతే। వృష్టేరన్నం తతః ప్రజా

ఇతి శాస్త్రాత్। ఏతాదృశీ శివా= శివస్య పత్నీ సుజ్ఞశీస్వరూపిణీ వా। నాసామణి:= నాసికాభరణవిశేషః, సౌమఙ్గల్యద్యోతకః। తస్య ప్రవరా. భాః = కాన్తిః తయా। తిమిరం= అన్ధకారమ్ "తిమిరం ధ్వాన్తే నేత్రామయే" ఇతి మేదినీ। ఉపరతిం= విలయనం, ఆసాదయేత్ = ప్రాపయేదితి ద్వికర్మకో యం ప్రయోగః। మదీయాన్ధకారం నివారయత్వితి ప్రార్థనా।యేనాన్ధకారేణ భగవతీసైవదృశ్యతేతేనుపశమయేతి భావః। యద్వా అన్ధకారవాచినా తిమిరశబ్దేన అజ్ఞానం లక్ష్యతే। అన్యత్సర్వం సమానం। నాసామణి ప్రభాయా, తన్నాశకత్వం దేవీసమ్బన్ధప్రభావాదే నేతిజ్ఞేయమ్"

అర్థము:—దాసాయమాన = దాసుఁడు (సేవకుఁడు) గానయిన సుమ = పుష్పములయొక్క, హాసా = వికసించుటవంటి నవ్వుగలదియు, కదమ్బ + వన= కడిమితోటలందు, వాసా = నివసించునదియు, కుసుమ్బ = బంగారువికారమయిన. సుమనః= పుష్పము (పద్మము) వాసా =నివాసము గాగలదియు, లేదా, కుసుమ్బ - కమణ్డలులతో గూడిన, సుమనః= దేవతలకు, వాసా= పొందదగిన స్థానమయినదియు. విపఞ్చీ =వీణయందుకృత= చేయబడిన, రాసా= అనురాగముగలదియు, లేదా విపఞ్చీ = వీణచేత, కృత = చేయబడిన, రాసా =రాసక్రీడగలదియు, వికాస = పోట్టిఁబడిన, మధు+మాస = చైత్రమాసమందలి, అరవిన్ద = తామరపువ్వునందలి, మధురా =మాధుర్యముగలదియు, కాసార= చెఱువునందుండునట్టి, సూన = పువ్వులయొక్క, తతి = సముదాయముయొక్క. భాసా= కాంతిచేత' అభిరామ= మనోహరమయిన, తనుః = శరీరముగలదియు, ఆసార = ధారావర్షమువలె, శీత =చల్లనైన, కరుణా = దయగలదియు. అగు, శివా= పార్వతీదేవి, నాసా+మణి= ముక్కరయొక్క, ప్రవర= శ్రేష్ఠమయిన, భాసా =కాంతిచేత, తిమిరం =చీకటిని (అజ్ఞానమును) ఉపరతిం= శాంతిని. అసాదయేత్ = పొందించుగాక.

ఆంధ్రవివరణము:- అనేకజన్మలలో జేసిన దుష్టకర్మలచే కల్గిన తమయజ్ఞానమును బోగొట్టుమని కవి యీశ్లోకమున ప్రార్థించుచున్నాడు. సాధారణముగా పుష్పములు ఏదో ఒకదినమునందు ఉదయమున ఒకసారి వికసించును, ఆవికాసము సర్వజనమనోరంజకముగా నుండును. కాని మరునాడావికాసముండదు. పూవులుగూడ నశించిపోవును. అట్టిపుష్పముల వికాసము ఈపార్వతి హాసమునకు దాస్యమునుజేసి ఆమె హాసమందలి గొప్పగుణము (సర్వకాల సర్వావస్థలందు నశించని వికాసము)ను పొందగోరెను. ఆదాస్యము నంగీకరించి యీమె జడులనుగూడ దయజూపినదను కీర్తిని సంపాదించినది. అనగా ఈమె ప్రకృతిశోభను మించిన సుందరహాసము గలదని భావము. తన మనస్సున కానందమును గలిగించుటచే భక్తులకోర్కెల దీర్చుటకు తొందరపడునట్లుగా జేయు కడిమితోటయందున్నదియు. బంగారు తామరపూగద్దెయందున్నదియు, లేదా, దేవతలు "భూలోకమువలె స్వర్గలోకముకూడ నశించిపోవు"నని తలంచి శాశ్వతస్థితిని పొందగోరి. భూలోకములోనికివచ్చి కమండలుధారణ మొదలగు నియమములు గలవారై పార్వతిని సేవించుచున్నారు. "అఖిల జన్మమునందు దేవిని పూజించి జీవన్ముక్తిని పొందుదురనెడు నాగమవాక్య ప్రమాణమువలన దేవతలీమెను గమ్యస్థానముగా నుపాసించుచున్నారు. ఈమె వీణాగానమునందెక్కువ యనురాగముగలది లేదా చెలికత్తెలతోగూడి రాసక్రీడల నాడును, వానియందు సౌకుమార్యము. లోకోత్తరత్వముగల వీణనుసంగీతసాధనముగా నుపయోగించుచున్నది, చైత్రమాసమందలి తామర పుష్పములు సకలలోక మనోరంజకమైన మాధుర్యముగలవై యుండును. అట్టిమాధుర్యమునుగూడ తిరస్కరించు మాధుర్యము ఈమెకుగలదు. అనగా నీమె మాధుర్యగుణముచే సర్వలోకములందలి వారిని వశీకరింపజేసికొను సామర్థ్యముగలదని భావము. లేదా ఈమెచేతియందు ఒకతామరపువ్వును ధరించి విలాసగా కదల్పుచున్నది. అప్పుడు ఆపువ్వునందు వ్రాలుటకువచ్చిన తుమ్మెదలు ఎగిరిపోవుచున్నవి. లేదా చైత్రారవిందమునందున్న అధికమక

చందమునుగూడ విడచి తుమ్మెదలు ఈమెవద్దకువచ్చి వ్రాలుచున్నవి. అనగా నీమె పద్మినీజాతి స్త్రీగనుక చైత్రారవిందముకన్న సౌకుమార్యసౌగంధ్యములు గలదియని భావము. మరియు నీమె తామరపూలదండను ధరించినది కనుకనే యింపయిన శరీరముగలది. ధారావర్షమువలె చల్లనైన దయ గలది. వర్షమువలన ఓషధులు చక్కగ ఫలించును. ఆయోషధులవలన ప్రజలు కలుగుదురు. వర్షముచే తాపములు శాంతించును. ధారావర్షము గావున దట్టముగానుండును. అడుగకపోయినను కురియుచుండును. ఈమె దయ ధారావర్షమువంటిదనుటచే వర్షమునకుండు పైగుణములన్నియు నీమె దయకుగూడ గలవని యూహించుకొనవలెను. మంగళప్రదురాలయిన యీపార్వతీదేవి ముక్కెరను ధరించినది. దానిలోని మణికాంతులు నాయజ్ఞానమనుచీకటిని బోగొట్టుగాకయని కవి ప్రార్థించుచున్నాడు. ఈమె ధరించినది కనుకనే అడ్డబాసలోని మణి, మానసికాజ్ఞానమును బోగొట్టగల దని భావము. దీనివలన ఈమెకేగాక యీమెకు సంబంధించినవానికిగూడ శక్తులన్నియు గలవని గ్రహించవలెను. అందుచేతనే యీమెసంబంధమయిన పాదోదకము, నిర్మాల్యము, ప్రసాదము, మంత్రము మొదలగునవి తాపత్రయశాంతినిజేసి ముక్తినిచ్చుచున్నవని భావము.

---

## సప్తమః శ్లోకః

శఙ్కాకరే వపుషి కఙ్కాలరక్తపుషి కఙ్కాదిపక్షివిషయే
త్వంకామనా మయసి కిం కారణం హృదయపఙ్కారిమేహి
గిరిజామ్, శఙ్కాశిలానిశితటఙ్కాయమాననపదసఙ్కాశమాన
సుమనో, ఝఙ్కారిభృఙ్గతతి మఙ్కానుపేతశశిసఙ్కాశ వక్త్ర
కమలామ్॥

## బుధతోషిణీ

వైరాగ్యసమ్పత్తయే దేహాత్మభ్రాన్తి నివారిణీం గిరిజాం సమాశ్రయణీయేత్యాహ శఙ్కాకరేతి॥ భోజన! వపుషి = శరీరే, కామనామ్ = ఇచ్ఛావిశేషమ్, అయసి = ప్రాప్నోషి, కిం కారణమ్? హృదయపఙ్కారింగిరిజామేహీత్యన్వయః। అథవా హే హృదయేతి సమ్బుద్ధ్యన్తంపదమ్। హేహృదయ పఙ్కారిమ్ = పాపవిరోధినీమ్, "అస్త్రీపఙ్కం పుమాన్పాప్మా పాపంకిల్బిషకల్మషం" మిత్యమరః। పాపనాశినీమిత్యర్థః। నష్టేసతి పాపే చిత్తశుద్ధిద్వారా ముక్తిసమ్పాదికేతి భావః। గిరిజామ్ = పార్వతీమ్, ఏహి = ఆశ్రయేత్యర్థః। కీదృశే వపుషి త్వాకాఙ్క్షాయాం విశినష్టి 'శఙ్కాకరే' ఇత్యాదినా। శఙ్కాయాః = సన్దేహస్య, ఆకరః = స్థానమ్, తస్మిన్, నియతసన్దేహాస్పదే ఇత్యర్థః। అనేకోపాయపరిపుష్టమపి పతయాళ్వితిభావః। అనేన చోపేక్షావిషయత్వం సూచితమ్। యద్వా శఙ్కాంకరోతీతి శఙ్కాకరం తస్మిన్ బాల్యాద్యుపచయాపచయాద్యవస్థా స్వాధిగతోల్బణత్వకృశత్వాదిక మనుపశ్యతః మనసి క్షణికతాగోచర స్సన్దేహః। నశ్యత శ్శరీరిణ శ్చితుపాఽ నుపశ్యతః స్వశరీర నశ్వరతాగోచరో వా సన్దేహః। తం కరోతీతిభావః కఙ్కాలః = త్వఙ్మాంసరహితశరీరాస్థి, తంచ రక్తం చ పుష్ణాతీతి కఙ్కాల రక్తపుట్

తస్మిన్ ఇద మస్పృశ్యాంసమేదో ఽస్థ్యాదిసముదాయాత్మకత్వా ద్వపుషః ఆత
యవే ష్ట్వివచర్మావృత్తే అవయవి న్యపి స్నేహయతాం [illegible] యతి దేహాధారత్వే
నావశ్యకస్యాపి [illegible] మదస్నేహతుత్వేన మరితజననద్వారా హే
యత్వ మితి చ సూచయతి। కఙ్కాః = గోత్రోపయోగిపత్త్రః లోహపృష్ఠః పక్షి
విశేషః। పలాదిః యేషాం పక్షిణాం తేషాంవిషయే, భోజ్యత్వేన నిర్దిష్టే వపుషి
కామనా మయసి కిమ్ కారణమ్? ఏవంచ సర్వధాత్మకే నశ్వరే, హేయే
ఘాతుకపక్షివిషయే చాస్మిన్ దేహే ఇచ్ఛావిశేషప్రాప్తి స్సర్వధావర్జనీయ
ఇతి భావః। ఇచ్ఛాసామాన్యస్యత్వ వర్జనీయత్వ మేవ। అన్యథా ధర్మసాధన
శరీర స్యోచ్ఛేదే తత్సాన్వయపరమపురుషార్థ స్యాప్యుచ్ఛేదాపత్తిః। అథ గిరిజాం
విశినష్టి శఙ్కే త్యాదినా। శఙ్కాః = సన్దేహాః, ఆత్మనిత్యత్వవిషయాః।
తా ఏవ శిలాః = పాషాణాః, తాసాం భేదనాయ, యః నిశితః = తీక్ష్ణధారః
టఙ్కః = అయసం శిలాభేదనసాధనమ్। స ఇవా చరతీతి టఙ్కాయమా
నం, తచ్చ తత్పదంచేతి కర్మధారయః తదేవ సఙ్కాశమానమ్=ప్రకాశమా
నమ్, సుమనః = పుష్పాణి, తస్మిన్ యే ఝఙ్కారిణః భృఙ్గాః = భ్రమరాః
తేషాం తతిః = సముదాయః యస్యాస్తాం తథోక్తామ్ శిలాభేదనాయాయస
సాధన మివ భక్తజనసన్దేహ నివారణాయ దేవీపదముపయుజ్యత ఇత్యర్థః
తథా ప్యాశ్రయణీయతా సూచనాయ సుమనస్త్వారోప ఇతిజ్ఞేయమ్। ఏవం
చ దేవీ స్వాశ్రితభక్తజన సంశయవిచ్ఛేదికేతి భావః అనేనచ "సంశయాత్మా
వినశ్యతి" ఇత్యాగమః దేవీభక్తవిషయే బాధితో భవతి। అథవా పదయోః
సఙ్కాశమానాః సుమనసః= దేవాః, త ఏవ ఝఙ్కారి భృఙ్గాః, తేషాం తతిః
యస్యా స్తా మితి తథోక్తామ్। సన్దేహగ్రస్తచిత్తాః దేవా అపితన్నివృత్తయే
దేవీపాదమూల ముపాశ్రితా ఇత్యర్థః। అత్ర ప్రథమపక్షే ఝఙ్కారి భృఙ్గ
శబ్దేన దేవీభక్తా అధ్యవసీయన్తే। ద్వితీయే పదశబ్దేన పుష్పాధ్యవసానం గ
మ్యతే। తథాచ పుష్పత్వే నాధ్యవసితం పదం గ్రాహ్య మితి భావః। అత్ర
ఝఙ్కారిపదేనచాపలత్వాదిగోచరాభక్తానాం ప్రథమాదవస్థాసూచితా

దేవానా మపి భక్తసాధారణత్వే నేద ముపపద్యత ఇతి బోధ్యమ్ అఙ్కేన= కళఙ్కేన, అనుపేతః= రహితః యః శశీ= చన్ద్రమాః తేన సదృశం, వక్త్రమేవ కమలం యస్యాస్తాం తథోక్తామ్ "నిభసంకాశనీకాశ ప్రతీకాశోపమాదయః" ఇత్యమరః అత్రకళఙ్కరహితేన చన్ద్రేణౌపమ్యవర్ణనా తథావిధస్య తస్యాఽప్రసిద్ధ్యా నిరుపమ మిదం దేవీముఖ మితిగమ్యతే॥

అర్థము:—హేహృదయ= ఓహృదయమా! శంకా= సందేహములకు, ఆకరే= నివాసస్థానమయినదియు (లేదా) శంకా= సందేహములను, కరే= కలిగించునదియు, కంకాళే= రక్తమాంసములులేని ఎముకలను, రక్త= నెత్తురును, పుషి = పోషించునదియు, కంక= రాబందులు, ఆది= మొదలుగాగల, పక్షి= పక్షులకు, విషయే= గుఱియయినదియు అగు, వపుషి= శరీరమునందు, త్వం= నీవు, కామనాం= కోరికను, అయసి= పొందుచున్నావు, కారణం కిం= హేతువేమి? పంక= పాపములకు, అరిం= శత్రువువంటిదియు, శంకా = సందేహములనెడు, శిలా= రాళ్ళకు, నిశిత= వాడియైన. టంకాయమాన= గడ్డపారవలెనయిన, పద= కాళ్ళనెడు, సంకాశమాన= ప్రకాశించుచున్న, సుమనః= పుష్పములందు, ఝుఙ్కారి= ధ్వనిచేయుచున్న, భృంగ= తుమ్మెదలయొక్క; తతిం= సముదాయముగలదియు; అంక= కళంకముతో; అనుపేత= కూడుకొనకయున్నట్టి; శశి= చంద్రునితో; సంకాశ= సమానమయిన;వక్త్ర = ముఖమనెడు;కమలాం= పద్మముగలదియు అగు గిరిజాం = పార్వతీదేవిని, ఏహి= పొందుమా.

ఆంధ్రవివరణము:—ఓహృదయమా! నీవీ శరీరమందెక్కువ కోరికను బెట్టుకొని ప్రేమతో బెంచుచున్నావు. ఈశరీరము నందెక్కువ కోరికలను బెట్టుకొని ఎన్నిమంచిపదార్థములతో బెంచినను శాశ్వతముగ నుండక నేడో రేపో నశించిపోవును. కనుక సందేహాస్పదమయినది. లేదా యీశరీర మనేక సందేహములను కలిగించుచున్నది. అనగా ఈశరీరము బాల్యావస్థయం

దోషవిధముగను, యౌవనమందొకతీరుగను, వార్ధకమున మఱొకతెన్నునను
కనబడుచున్నది. కనుక నిది స్థిరమా యస్థిరమా యనుసందేహము కలిగించు
చున్నదని భావము. లేదా లోకములో నశించిపోవుచున్న శరీరములను
జూచుచు తనశరీరముగూడ నట్లే నశించుననెడు సందేహమును గలిగించు
చున్నదని భావము. అదిగాక మనమెన్ని శ్రేష్ఠపదార్థములతో పెంచినను ఈ
శరీరము ఆపదార్థములచే నస్పృశ్యములగు నెముకలను, మదకారణమయిన
రక్తమును పోషించునేకాని శాంతాదిగుణములను పోషించుటలేదు. అయితే
రక్తాస్థులు లేకున్నచో శరీరమే నిలువదుగదా! ఆశరీరమే సకలధర్మములకును
ప్రధానమైనదిగదా. యీశరీరదూషణవలన ప్రయోజనమేమి? అనగా
ఇచ్చట శరీరపోషణమాత్రమందే లక్ష్యముంచుకొని, పుష్టికలిగినకొలది
పుష్టికొఱకే యత్నించుచు తద్ద్వారా దుష్టకార్యములను జేయుచు నాశనము
నకు దారితీయువారిని దూషించుచున్నాడనియు, భక్తిజ్ఞానములద్వారా
ముక్తిని సాధించునట్టి శరీరపోషణము మాత్రము కోరదగినదేయనియు
గ్రహించవలెను. మరియు నెంతరక్తమాంసముల పుష్టిగలిగినను అంత్యకాల
మున రాబందులు మొదలగు పక్షులు పొడుచుకొని తినివేయును, కాని
యీ శరీరమున కంతకంటె సద్వినియోగములేదు. కనుక యోహృదయమా!
ప్రతిక్షణము మార్పులుచెందుచు, నసహ్యకరమై, ఘాతుకపక్షులు పొడుచు
కొని తినుటకంటె సద్వినియోగములేక నశించిపోవునట్టి యీశరీరమునం
దాశను విడచిపెట్టి పార్వతీదేవిని శరణుపొందుము. ఆమె నీలోనున్న పాప
ములను బోగొట్టును. ఇదిగాక ఈమె సందేహములనెడు పెద్దరాళ్ళను తెగ
గొట్టి పారవేయుటకు సమర్థమయిన పారలవంటి పాదములు గలది. ఎవ
రును ఎత్తలేని పెద్దరాళ్ళను గునపములతో పొడిచి, త్రవ్వి, చిన్నవిగను
చూర్ణముగనుజేసి యావలకు ఎత్తివేయుట ఎంతసులభమో అంతసులభముగా
నీమె పాదములు భక్తులసందేహములు బోగొట్టును. అనగా నీమె పాద
సేవకులకు హృదయములో నెట్టిసందేహములును నుండవని భావము.

అట్టిపాదములనెడు పద్మములందు తుమ్మెదలు ధ్వనించుచున్నవి. లేదా అట్టిపాదములందు దేవతలనెడు తుమ్మెదలు "మమ్ము తరింపజేయుమమ్మా!" యని ధ్వనించుచు నాశ్రయించు చున్నారు. అనగా భక్తులనెడు తుమ్మెదలామె పదపద్మముల నాశ్రయించిరనిగాని దేవతలు తుమ్మెదలరూపమున నీమె పదపద్మముల నాశ్రయించిరనిగాని భావము. దేవతలుగూడ భక్తివిషయమునందు మనుష్యులతో సమానులుగనుక స్వర్గాదులుగూడ నశించిపోవునవియని తలచి దేవతలు తుమ్మెదలరూపమునవచ్చి శాశ్వతస్థితిని పొందగోరి పార్వతిపాదముల నాశ్రయించిరనిభావము, లోకములోని చంద్రునకు కళంకము స్వభావసిద్ధము. చంద్రునకాకళంకము లేనిచో నీమె ముఖమునకుపమానమగుటకు తగియుండును. అనగా కళంకములేని చంద్రునివలె ప్రకాశించుచున్న ముఖముగలదని యర్థము. అనగా కళంకముగల చంద్రబింబమే సర్వజనహృదయాహ్లాదముగ నుండగా కళంకరహితచంద్రునివలె ముఖము ప్రకాశించుచున్నదనుటచే నీమె ముఖము నిరుపమమనియు, సర్వలోకాతిశాయి సంతోషసంధాయి యనియు భావము. ఓహృదయమా అట్టిపార్వతీదేవిని ఆశ్రయించి సందేహములను హృదయపాపములను, పోగొట్టుకొని, సుఖములను జెందుమా యని భావము.

---

శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః

## అష్టమః శ్లోకః

జమ్భారికుమ్భిపృథుకుమ్భాపహాసికుచ సమ్భావ్యహారలతికే
రమ్భాకరీన్ద్రకరదమ్భాపహోరుగతిడిమ్భానురఞ్జితపదే
శమ్భావుదారపరిరమ్భాఙ్కురత్పులకదమ్భానురాగపిశునే
శమ్భానుసారాభరణసమ్భావనాశిశిరితే హ్యమ్బరప్రహరణా.

## బుధతోషిణీ

సత్సుఖరూపబ్రహ్మోపదేశం సాత్రిక్రయతి జమ్భారీతి। జమ్భో నామ కశ్చిదసురః తస్య అరిః = శత్రుః ఇన్ద్రః తస్య యః కుమ్భీ = ఐరావత నామకో గజః తస్య యౌ పృథూ = స్థూలౌ, కుమ్భౌ. తౌ అపహసత ఇతి తథోక్తౌ కుచౌ, తయోః సమ్భావ్యః = ఉత్కృష్టాశ్రయలాభేన ప్రశంస నీయః హారః, స ఏవ లతికా యస్యాః సా తథోక్తా। ఐరావతకుమ్భాతి శాయినౌ తస్యాః కుచౌ విశేష్యౌ। అత్ర అపహాసిపదేన దేవీకుచయోః పరిణాహోన్నత్యకాఠిన్యాదిషు నిరుపమత్వం సూచ్యతే ఏతాదృశాశ్రయ మూలకమేవ హారలతికాయాః ప్రశంసనీయత్వమితి భావః, రమ్భా = కదలీ స్తమ్భః, కరీన్ద్రకరః = గజశ్రేష్ఠహస్తః, తయోః యః దమ్భః = గర్వః తమపహాత ఇతి తాదృశౌ ఊరూ. గతిః = గమనేన, డిమ్భస్యేవ అనుర ఞ్జితే పదే చ యస్యాస్సా తథోక్తా। రమ్భా కరికరాతిశాయినౌ తస్యా ఊరూ ఇతి భావః। తాదృశోరుభారేణ గమనే మాన్ద్యం ప్రతీయతే అతఏవ తత్పాదయోః డిమ్భపదోపమ్యద్వారా అనురఞ్జితత్వోక్తిః సఙ్గచ్ఛతే అనేన చ తత్పాదయోః సౌకుమార్యాతిశయః వ్యజ్యతే। శమ్భౌ = శఙ్కర విషయే ఇతి అనురాగాన్వయి। ఉదారః = గాఢతరః చ అసౌ పరిరమ్భః = ఆలిఙ్గనం, తేన అఙ్కురవదాచరన్తి యే పులకాః = రోమాఞ్చాః తేషాం దమ్భేన = గర్వేణ, అతిశయే నేత్యర్థః। అనురాగం (శివవిషయకం) పిశున యతి = సూచయతీతి తథోక్తా। ఫలకోద్గమేన పతివిషయానురాగం సూచయతీత్యర్థః। [illegible]

తద్వదిమే పులకా అపి అప్రత్యక్షశివవిషయకానురాగమనుమాపయన్తీతి భావః। దేవీకృతపరిరమ్భణస్య ఔదార్యం స్వరమణస్య సుఖప్రదత్వాత్ అతఏవ సాభిప్రాయ శమ్భుపదప్రయోగః। శమ్ = సుఖం, భవత్యస్మాదితి వ్యుత్పత్తేః। భాసురాణామ్ = విద్యోతమానానామ్, ఆభరణానామ్ = అలఙ్కారాణామ్, గుమ్భః = గుమ్ఫనం యస్యాస్సా తథోక్తా। అనేన చాలఙ్కారాణాం బాహుళ్యం శ్రైష్ఠ్యంచ ద్యోత్యతే। శమ్భ ఇతి కశ్చనాసురః తం ప్రహరతీతి ప్రహరణా ప్రహరణేతి నన్ద్యాదిత్వాల్ ల్యుప్రత్యయాన్తః నన్దనేతి భాష్యప్రయోగాదస్య టాబన్తత్వమ్, తాదృశీ కాళికా, శం = సుఖలక్షణమ్ సత్ = సల్లక్షణం చ, బ్రహ్మ ఆదిశతు = ఉపదిశతు, అథవా సదా = సర్వకాలమ్, శమ్ = సుఖమ్, శాశ్వతసుఖమిత్యర్థః। దిశతు = దదాతు, ఆదిశతు ఇతి వా పదచ్ఛేదః। అర్థస్తు స ఏవ। యత్త్రికాలాబాధ్యం సుఖస్వరూపం చ తద్బ్రహ్మాదిశత్వితి ప్రార్థనా.

అర్థము:— జమ్భారి = దేవేంద్రునియొక్క, కుమ్భి = ఐరావతమను ఏనుగుయొక్క, పృథు = గొప్పవయిన, కుమ్భ = కుమ్భస్థలములను, అపహాసి = నవ్వుచున్న, కుచ = స్తనములందు, సంభావ్య = ప్రశంసించదగిన, హార = ముత్యాలహారమనెడు, లతికా = తీగగలదియు, రమ్భా = అరటిబోదలయొక్క, కరీంద్రకర = శ్రేష్ఠములగు ఏనుగుతొండములయొక్క, దమ్భ = గర్వమును, అపహా = పోగొట్టునట్టి, ఊరు = తొడలును, గతి = నడకచే డింభ = బాలునకువలె, అనురఞ్జిత = ఎఱ్ఱబడిన, పదా = పాదములును, గలదియు, శంభౌ = శివునివిషయమందు, ఉదార = గొప్పదయిన, పరిరంభ = కౌగిలిచేత, అంకురత్ = మొలకలెత్తుచున్న, పులక = గగురుపాటుయొక్క దంభా = గర్వముచే (ఆధిక్యముచే) అనురాగ = ప్రేమను, పిశునా = తెలియ (సూచన) చేయుచున్నదియు, భాసుర = ప్రకాశించునట్టి ఆభరణ = వస్తువులయొక్క, గుమ్భా = కూర్పుగలదియు, శంభ + అసుర = శంభుడను రాక్షసుని ప్రహరణా = చంపునట్టిదియు నగు కాళికాదేవి, శం = సుఖరూపమును; సత్ = సద్రూపమును అగు పరమాత్మను ఆదిశతు = ఉపదేశించుగాక లేదా. సదా = ఎల్లప్పుడు శం = సుఖమును దిశతు = ఇచ్చుగాక.

ఆంధ్రవివరణము:— కవి సుఖస్వరూపమయిన బ్రహ్మ నుపదేశింపుమని ప్రార్థించుచున్నాడు. సాధారణముగా లోకములోని ఏనుగులకంటె దిగ్గజములు బలిష్ఠములై యుండును. వానికంటె దేవేంద్రుని వాహనమయిన ఐరావతము విశేషబలమదములు గలిగియుండును. పార్వతీదేవి అట్టి ఐరావతముయొక్క గొప్పవయిన కుంభస్థలములను పరిహాసము చేయుచున్న స్తనములుగలది. ఆ స్తనములందు గౌరవింపదగిన తీగలవంటి ముత్యాలహారముగలది. అనగా పార్వతికుచములు ఐరావతకుంభస్థలములకంటె నెక్కువయిన కాఠిన్యము, వైశాల్యము ఔన్నత్యముగలిగి నిరుపమానములుగానున్నవనియు అట్టిసర్వోత్తమస్తనములందుండుటచే హారమునకు గౌరవము కలిగినదనియు భావము. మరియు నీమె తొడలు అరటిబోదెల గర్వమును ఏనుగుతొండముల పొగరును బోగొట్టుచున్నది. అనగా ఆదోకగా నుండుటలో నరటిబోదెలు ఏనుగుతొండములు ప్రసిద్ధములై తొడలకుపమానములయినవి. కాని వానినిమించిన ఆదోకతనము సౌకుమార్యముగలిగి ప్రకాశించు తొడలుగలదనిభావము. అదిగాక చిన్నపిల్లవాడు నడచునప్పుడు తక్కువఅడుగులు మెల్లగా వేసినను పాదములెఱ్ఱబడును అట్లే ఈమె పాదములు నడకచే నెఱ్ఱబడినవని భావము. దీనిచే నామె యెంతసౌకుమార్యముగలదో తెలియుచున్నది. పార్వతికి తన యర్ధశరీర మిచ్చుటచే శివునిప్రేమ వెల్లడియగుచున్నది. కాని పార్వతీదేవిప్రేమ వెల్లడికాలేదు. ఇచ్చట గాఢాలింగనముచే పార్వతికి గగుర్మొలకెత్తినదియని చెప్పుటచే ఆగగురుపాటుచే శంకరునియందు పార్వతికిగల ప్రేమ స్పష్టమయినది అనగా వృక్షము ప్రత్యక్షముగా నగుపడకపోయినను మొలకలనుబట్టి యూహించుకొందురు. అట్లే యీమెయొక్క గగురుపాటుచే శంకరునియందెంతప్రేమ పార్వతికున్నదియు తెలియుచున్నదని భావము. పార్వతీవల్లభుడు (శంకరుడు) సుఖమును కలిగించువాడు కనుక పార్వతీదేవి కౌగిలిచే నంతసుఖము ననుభవించినదని తోచుచున్నది. చక్కగ ప్రకాశించుచున్న యాభరణములను ధరించినదియు. శంభుడను రాక్షసుని సంహారించినదియునగు పార్వతీదేవి ఏకాలమందును నాశనమును బొందని శాశ్వత సుఖస్వరూపమయిన బ్రహ్మను ఉపదేశించుగాక యని కవి ప్రార్థనము. లేదా సర్వకాలములందుండు సుఖము నిచ్చుగాకయని ప్రార్థనము.

శ్రీ లక్ష్మీహయగ్రీవాయనమః

## నవమః శ్లోకః

దాక్షాయణీ దనుజశిక్షావిధౌ వితతదీక్షా మనోహరగుణా
భిక్షాశినో నటనవీక్షా, వినోదముఖి దక్షాధ్వరప్రహరణా
వీక్షాం విధేహిమయి దక్షా స్వకీయజనపక్షా విపక్షవిముఖీ
యక్షేశసేవితనిరాక్షేపశక్తి జయలక్ష్మ్యవదానకలనా॥

## బుధతోషిణీ

కవిరత్ర సర్వసామర్థ్యసముల్లాసి కాళీకరుణాకటాక్షవీక్షణం కాంక్షతి
దాక్షాయణీతి। హే వినోదముఖి: త్వం మయి వీక్షాం విధేహీత్యన్వయః।
దక్షస్య = ప్రజాపత్యం స్త్రీ దాక్షాయణీ। ఏతేనచాస్యాః అవతా
రాన్తరేష్వప్యాభిజాత్యం గమ్యతే। దనోర్జాతాః దనుజాః = అసురాః
తేషాం యా శిక్షా తస్యాః విధిః తస్మిన్ వితతా = విస్తృతా దీక్షా = అభినివేశః
యస్యాస్సా తథోక్తా। దుష్టశిక్షణాభినివిష్టేత్యర్థః। దీక్షాపదేనచ దుష్టశిక్షణా
ర్థమేవావతీర్ణేయమితి ధ్వన్యతే। మనోహరాః గుణాః యస్యాస్సా తథోక్తా।
సకలప్రాణిహృదయాహ్లాదిసుగుణపరిపూర్ణేత్యర్థః। భిక్షయా కరణేన అశ్నా
తీతి భిక్షాశీ, తస్య భిక్షాశినః = శఙ్కరస్య, యద్వా భిక్షాం = యాజ్ఞాప్రాప్త
మన్నాదికమశ్నాతీతి భిక్షాశీ। అత్ర భిక్షాశబ్దేన తత్ప్రాప్తమన్నాదికం
లక్ష్యతే। తస్య భిక్షాశినః నటనస్య = తాణ్డవాఖ్యస్య నాట్యస్య విశేషేణ
ఈక్షా వీక్షా = అత్యాసక్తిదర్శనం యస్యాస్సా తథోక్తా। సాపేక్షత్వేఽపి
గమకత్వాత్సమాసః। శఙ్కరతాణ్డవమత్యాదరేణపశ్యతీత్యర్థః। యద్వా
అనటనఇతిచ్ఛేదః। భిక్షాశినః అనటనే = భిక్షార్థమటనాభావే. వీక్షా =
పర్యవేక్షణం యస్యాస్సా తథోక్తా॥ అన్నపూర్ణాయాః స్వస్యాః లాభేన
భిక్షాటనస్య ప్రసక్తేరనావృత్తిః స్వాజ్ఞయా తత్ర ప్రవృత్తం శివం నివా

రయితుం సర్వదా జాగరూకేత్యర్థః। క్షణమపి శివవియోగ మసహమానా తత్ దటన నివారణపరేతి వార్థః। దక్షస్యయః అధ్వరః=యాగః, అశివారమ్భః తం ప్రహరతీతి తథోక్తా। సర్వసమర్థస్యాపి స్వపితుః ప్రజాపతే రశివారమ్భ యాగం నాశయామాసేతి పౌరాణికీ గాథాఽత్ర సూచితా। ఏతేనచాధర్మనా శినీ ప్రజాపతీ నామపిని యామికేతిచ గమ్యతే। దక్షో = అఘటన ఘటనా సమర్థా। స్వకీయాః = స్వీయభక్తాః యేజనాః తేషాం పక్షః = పార్శ్వం యస్యాస్సా తథోక్తా। భక్తజనపార్శ్వవర్తినీత్యర్థః। విపక్షాః=శత్రవః, తేషాం విషయే విముఖీ = పరాఙ్ముఖీ, తిరస్కృత్య శత్రుపక్షేత్యర్థః పక్షిముఖీతి వా। యథా పక్షిణః ముఖేన (చఞ్చుపుటేన) ఫలలాదికం తోడయన్తి తద్వదియమపి శత్రూనిత్యర్థః। యక్షాణాం దేవయోని విశేషాణా మీశః యక్షేశః = కుబేరః, తేన సేవితః = సఖిత్వాత్పూజితః శివః, తస్యయాని లాక్షేపా - జనిన్దావిషయే శక్తిః = సామర్థ్యం, జయః = సర్వోత్కర్షశ్చ, తయోః లక్ష్మణామ్=చిహ్నభూతానామ్. అవదానానామ్ = ప్రశస్తకర్మణామ్, కలనమ్ = సాహిత్యమ్ యస్యాస్సా తథోక్తా। "అవదానం కర్మవృత్తమ్" ఇతి కలఙ్కాఙ్కౌలాఞ్ఛనంచ చిహ్నం లక్ష్మ చ లక్షణమితి చామరః।. శివస్య శక్తిజయసూచకాని సౌభాగ్యప్రదాని ప్రశస్తకర్మాణి సదా కరోతీత్యర్థః। స్త్రీణాం సదాచారవర్తనం తు భర్తౄణాం శక్తి[illegible]సూచిహ్నం చేతి శాస్త్రప్రసిద్ధమ్। యద్వా యక్షేశసేవితః = శివః। ఆత్మనః ధనాధిపత్యసుస్థిరత్వాయ కుబేరః లోకోత్తరగుణశాలినం సర్వశత్రుసంహారకం శివం సేవత ఇతి యక్షేశసేవితపదేన శివస్య నిర్దేశః సాభిప్రాయః కృతః। తస్మాత్ త్రిపురారేః నిర్గతః . ఆక్షేపః=నిన్దా యయోస్తౌ శక్తిః=సామర్థ్యం, జయః=సర్వోత్కర్షశ్చ, తయోః లక్ష్మణామ్=చిహ్నభూతానామ్, అవదానానామ్-ప్రశస్తపరాక్రమకృత్యానాం, కలనం=సాహిత్యం యస్యాస్సా తథోక్తా। త్రిపురసంహారాదిషు ప్రకటితశక్తిజయోపేతేన శఙ్కరేణ సహ్యోక్తినన్దితా శక్తిజయా స్వపరాక్రమకృత్యేషు మహిషాసురమర్దనాదిషు దేవీ ప్రదర్శితవతీత్యర్థః। అనేనచదామ్పత్యానుగుణ్యమభివ్యజ్యతే, అనేనదేవీవిశేషణేన ప్రార్థయితరి శక్తిజయసంక్రమణం ప్రార్థనా

గోచరంభవతి। ఏవమేవాస్త్యైరపి దేవీ విశేషణైః ప్రార్థయితరి యథాయో
గం తత్తద్విశేషశాలితా పార్థనావిషయత్వేన ప్రతీయతే। వినోదః=కౌతు
కం సుఖే యస్యాస్తస్యాస్సమ్బుద్ధిః హేవినోదసుఖిత్వంమయి-దీనజనే,వీక్షాం
విధేహి=కురు దీనజనానుకమ్పాపేక్షణమపితవైకోవినోదోభవత్వితి సమ్బుద్ధి
తాత్పర్యమ్.

అర్థము :— హేవినోద + సుఖి = సంతోషము సుఖమునందు
గల యోపార్వతీదేవీ! (త్వం = నీవు) మయి=నాయందు, వీక్షాం = చూపును
విధేహి=ఉంచుమా [ఇది ప్రార్థనము] ఇంక పార్వతిని విశేషణములచేనిర్దే
శించుచున్నాడు. ద్రాక్షాయణీ-దక్షునికూతురను,దనుజ=రాక్షసులయొక్క,
శిక్ష-శిక్షించుటయొక్క-విధా-పద్ధతియందు,వితత-పెద్దదగు,దీక్షా=పట్టుదలగల
దియు,మనోహార= మనస్సునకింపైన,గుణా= సుగుణములుగలదియు.భిక్షా
భిక్షమెత్తుటచే, అశినః= భుజించువాడగుశివునియొక్క,లేదా.భిక్షా= తిరిప
మెత్తుటచే గల్గిన అన్నాదులను, అశినః= భుజించునట్టి శంకరునియొక్క,
నటన= తాండవమనుపేరుగల నాట్యముయొక్క, ప్రేక్షా = చూచుటగల
దియు. లేదా, భిక్షాశినః =బిచ్చమెత్తిన అన్నాదులనుతినునట్టి -శంకరుని-
~~యొక్క, నటన= బిచ్చమెత్తునప్పుడు~~ తిరుగకయుండుటయందు, వీక్షా=
చూపుగలదియు,దక్ష= దక్షునియొక్క, అధ్వర =యజ్ఞమును,పరిహారణా-
నాశముచేసినదియు, దక్షా= సమర్థురాలును, స్వకీయ= తనభక్తులయిన,
జన= మనుష్యులయొక్క, పక్షా= వైపునందుండునదియు, విపక్ష = శత్రు
వులనిష్టమయందు, విముఖీ= పెడమొగముగలదియు, లేదా వి + ముఖీ=
పక్షులవంటి మొగముగలదియు, యక్షేశ =యక్షులకు ప్రభువయిన
కుబేరునిచే, సేవిక= పూజింపబడు శంకరునియొక్క, నిరాక్షేప = నిందింప
నట్టి, శక్తి =సామర్థ్యమునకు, జయ =జయమునకు, లక్ష్మ= గుర్తుల
యిన, అవదాన= ప్రశస్తకర్మలతో, కలనా =కూడికొనియున్నదియు అగు
పార్వతీదేవి నాయందు చూపునుంచుగాకయని ప్రార్థనము.

ఆన్ధ్రవివరణము:—ఈశ్లోకమందు కవి అన్నిశక్తులతో ప్రకాశించునట్టి దేవియొక్క కీర్తికాంతిచూపుల ప్రసారమును గోరుచున్నాడు. ఎల్లప్పుడును సంతోషించు ముఖముగల యోపార్వతీదేవీ! నీవు నాయందు ప్రేమపూరితమయిన కీర్తికాంతిప్రసారము నుంచుమాయని ప్రార్థించుచున్నాడు. పార్వతీదేవి యెట్టిదనగా? ఈమె సతీజన్మమునందుగూడ సర్వసమర్థుడైన దక్షుని యుత్తమకుటుంబమున జన్మించినది. దుర్మార్గులయిన రాక్షసులను శిక్షించుటయందు పట్టుదలగలది. అందరి మనస్సులను ఆకర్షించునట్టి మంచి గుణములుగలది. బిచ్చమెత్తి భుజించునట్టి శంకరునియొక్క తాండవమను పేరుగల నాట్యము నత్యాదరముతో చూచుచున్నది. లేదా నేనెక్కడ నున్న నక్కడ అన్నరాశులు గల్గుచుండునుగదా యట్టి యన్నపూర్ణనైన నన్ను వివాహమాడి శంకరుడు బిచ్చమెత్తుట పాడిగాదని తనభర్త తిరిపము కొఱకు తిరుగుటను మాన్పించుటకై జాగరూకతతో జూచుచున్నది. లేదా తనభర్త బిచ్చమునకేగునప్పటి వియోగమునుగూడ సహించలేక బిచ్చమునకు తిరుగకున్నచో బాగుండునని ఆలోచనతో చూచుచున్నది. తనతండ్రియైన దక్షుడు శివుని నాహ్వానింపక అధర్మముగా యాగమును జేయ మొదలిడెను. అప్పుడు తండ్రియనియైన లెక్కించక అయ్యధర్మయజ్ఞమును నాశనము చేసెను. అన్నిలోకములందుగూడ చెప్పుటకుగాని యూహించుటకుగాని యలవికాని సర్వకార్యములను జేయగల సామర్థ్యముగలది. దనభక్తులకుసమీపమందుండి ఏయాపదయు రాకుండ కాపాడునది. శత్రువులను తిరస్కరింపగల శక్తిగలది. లేదా పక్షి ముక్కుతో మాంసమును పొడుచుకొని తిని వేయునట్లు ఈమె శత్రువులను పొడువగలదు. యక్షులకు ప్రభువు కుబేరుడు. ఆకుబేరుడు నవనిధులకు ప్రభువు. తనవిధులను రక్షించుటకుగాను సర్వసంహారకారకుడయిన శంకరునితో స్నేహమును జేసి యాతనిని పూజించుచున్నాడు. అట్టి శంకరునకు శక్తి, జయము గలుగుటకుతగిన ప్రశస్తకార్యలను జేయుచున్నది. అనగా స్త్రీల సదాచారమువలన భర్తలకు జయము,

శక్తి. ఆయువు కలుగుచుండునని శాస్త్రముగలదు. ఈపార్వతి యట్టిశాస్త్ర మునను సరించి తనభర్తకు జయశక్త్యాయువుల గలిగించు సదాచారముతో నున్నదని భావము. ఈమె నడవడికవలననే శంకరునకుగూడ జయాదులు గలుగుచున్నవనియు. నందుచే నీమెయే కొనియాడదగినదనియు గ్రహింప వలెను. లేదా, శంకరుడు త్రిపురాసుర సంహారము మొదలగు కార్యములందు తనశక్తినిజూపిజయమును పొందెను. అట్టిశంకరునిశక్తి జయములసామ్యచిహ్నము లయిన ప్రశస్తకర్మలను ఈమెగూడ మహిషాసుర మర్దనాదులందు చేసినది. అనగా శంకరునకు తగిన శక్తిసామర్థ్యములు ఈమెయు గలవనిభావము. కనుక దాంపత్య మనుగుణముగానున్నదని తెలియుచున్నది. అట్టి శక్తి జయములు గల పార్వతీవీక్షణమును ప్రార్థించుటచే కవికిగూడ ఆశక్తి జయములు గలుగు నట్లు కోరెనని ప్రార్థనలోని భావము వెల్లడియగుచున్నది. ఇట్లే దేవికి వేసిన యితరవిశేషణములచే వానివాని అర్థములకనను గుణమయిన శక్తులను కవి కోరినట్లు గ్రహింపవలెను.

శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః

దశమః శ్లోకః.

వన్దారులోక వరసన్దాయినీ విమలకున్దావదాతరదనా
బృన్దారబృన్ద మణిబృన్దారవిన్ద మకరన్దాభిషిక్తచరణా
మన్దానిలాకలిత మన్దారదామభిరమన్దాభిరామమకుటా
మన్దాకినీ జవనభిన్దాన వాచమరవిన్దాసనా దిశతు మే॥

ఇతి శ్రీ కాళిదాసకృతా దేవీ దశశ్లోకీ స్తుతిస్సమాప్తా.

బుధతోషిణీ.

సర్వేశత్వోల్లాసినీం ధారాశుద్ధిం స్వకవనే ప్రార్థయతి వన్దారుర్వితి॥ అరవిన్ద— ఆసనం యస్యాస్సా=పద్మాసనస్థా కాళికా, మే = మహ్యమ్, వాచమ్, దిశతు = దదాత్విత్యన్వయః॥ కీదృశీ కాళికేతి విశినష్టి। వన్దారవః=నమస్కృతిశీలాః, తే లోకాః_జనాః "లోకస్తు భువనే జనే" ఇత్యమరః, తేషాం వరాః = వాఞ్ఛితాని. "దైవాద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియే" ఇత్యమరః, తాన్ సమ్యక్ = అనుకూలం యథాతథా దదాతీతి తథోక్తా। వన్దారుశబ్దేన భక్తానామ కృత్రిమావిరతభక్తి సమ్పన్నత్వమ్। సన్దాయినీత్యనేన దేవ్యాః భక్తానాం కమ్మా తత్పరత్వం చ గమ్యతే। విమలాః_స్వచ్ఛాని యాని కున్దాని_మాఘ్యాని "మాఘ్యం కున్దం" మిత్యమరః, తద్వద అవదాతాః = సితాః "అవదాతస్సితో గౌర" ఇత్యమరః। రదనాః =దన్తాః యస్యాస్సా తథోక్తా। "రదనా దశనా దన్తా రదా" ఇత్యమరః। నిర్మలసితదన్తశోభినీత్యర్థః। సితదన్తానాం భాగ్యభోగ సూచకత్వం సాముద్రికశాస్త్ర ప్రసిద్ధమ్। బృన్దేన-సమూహేన, ఆసమన్తాత్ బుచ్ఛన్తి=గచ్ఛన్తీతి బృన్దారాః=దేవయోనివిశేషాః తేషామ్ యద్బృన్దమ్— సమూహః, తస్య మణయః = చిన్తామణి ప్రభృతయః। తేషాం బృన్దమ్ యస్యాస్సా తథోక్తా। సకలదేవతాః చిన్తామణ్యాదిభిరేనాము పూజన్నిత్యర్థః। అరవిన్దానామ్, పద్మానామ్, యో మకరన్దః =మధు, తేన అభితః సిక్తౌ చరణౌ యస్యాస్సా తథోక్తా। పద్మమకరన్దేన పాదయోరభిషిక్తేత్యర్థః। "మధునా మధురావాణీ" ఇత్యాదినా తన్త్రగ్రన్థేషు మధునః అభిషేక ద్రవ్యత్వేనోక్తత్వాత్। అథవా పూజాసమర్పితారవిన్దేభ్యస్స్రవతా మకరన్దేన అభితః సిక్తచరణేత్యర్థః। అనేన అవిరళ పద్మపూజా సాతత్యం సూచ్యతే। మన్దశ్చాసావనిలశ్చేతి కర్మధారయః। తేన అకలితాని-సంయుతాని, మన్దారాణామ్ =కల్పవృక్షప్రసూనా

వాన్, దామాని-మాలాః తైః తథోక్తైః అమన్దం =అధికమ్యథా
అభిరామమ్= మనోహరమ్, ముకుటమ్-కిరీటం యస్యాస్సాతథోక్తా
కాలితశ్లేషదామగతసౌగన్ధ్య ప్రసారశ్చవ్యజ్యతే। వాచంవిశినష్టి మ
మన్దాకినీ =ఆకాశగఙ్గా॥ "అమన్దాకినీవియద్గఙ్గా స్వర్ణదీసురదీర్ఘికా"
తస్యాః యః జవనః-ప్రవాహః తంభిన్తే-తిరస్కరోతీతి తాదృశీచసా
విశేషణసమాసః। అత్ర జవస్సాతో ధాతుః గతౌ వేగేచ। జుచఙ్క్రమ్యే
"జవనస్తుస్యదేవేగివాయే నా వేగినిత్రిషు" ఇతి మేదినీ। వేగవానిత్య
వేగశీలత్వాన్మన్దాకినీ సాన్నిధ్యతశ్చజవనశబ్దస్య ప్రవాహార్థకత
ఆనేన ఆకాశగఙ్గాప్రవాహాధిక వేగశాలివచాంస్యాదిశేతి ప్రా
భావః। యద్వామన్దాకిన్యాః యః జవః-వేగవాన్ ప్రవాహః। అర్శ
ఆద్యచ్। "తరస్వీత్వరితో వేగీ ప్రజవీజవనోజవః" ఇత్యమరః। తసా
హన్నభిన్తే ఇతినభిన్దానా। నఞర్థస్యనశబ్దస్యభిన్దానేత్యనేనసుప్సునే
మన్దాకినీప్రవాహాభిన్నా వాగిత్యర్థః అనేనమన్దాకినీ ప్రవాహసాదృ
వాచి ప్రసిద్ధ్యత ఇతిఫలితమ్। ఏవంచస్వవాచి మన్దాకినీప్రవాహ
ధర్మాః సాంగ్రహణీయత్వేన ప్రతీయన్తే। తేచధర్మాః దేవీవిశేషణా
ప్రవాహే, తద్ద్వారా వాచిచోన్నేతుం శక్యన్తే। యథా। వన్ద
నప్రాయినీత్యనేన దేవీగతం భక్తజనవాఞ్ఛా పరిపూరకత్వం గ
తద్భిన్నాయాం వాచిచగమ్యతే। వాక్ప్రశ్లేషభక్తజనాః పతితాః శి
ష్టవన్తి ఏవమేవవిమలకున్దావదాతరదనేత్యనేన స్వచ్ఛత్వం, బృ
ముఖి బృన్దేత్యనేనదేవపూజ్యత్వం। అరవిన్ద మకరందాభిషిక్త చరణే
పుర్యశాలిత్వమ్. మందానిలాది మకుటాన్తేన మానసోల్లాసిత్వం లో
ఉభయత్రావిగమ్యతే। ప్రవాహసాదృశ్యేన చ అనర్గళధారా
గమ్యతే। ఏవంచ కాళిదాసు వచస్సుయథోక్త సకలగుణసమ్పత్తిః
"ఏతాదృశ సకలలక్షణ లక్షితత్వ మస్యాశ్శైవస్తుతేః పరాంకాష్ఠాః
పరోత్తమత్వమస్యాఃస్తుతేః ప్రతిభాతి ఆద్యన్తపద్యయోః. కవితా
గవయాకవిరహం "సకవితా యద్యస్తిరాజ్యేనకిమ్" ఇతిలోకో
క్తిరమణీతిలకమ్॥

ఇతి శ్రీలక్ష్మీహయవదన దేవపాదమూల తలావాసమహాన
వైభవోపేతేన, పూర్వగోదావరీమణ్డలాన్తర్గత కపిత్థపురీనివాసి శ్రీ

గా విశాలాక్షీ-సుబ్రహ్మణ్యముని సజ్జాఖ్య కాత్మజాగ్రజేన, రాజమహేంద్రపుర పురపాలక సఙ్ఘోన్నత పాఠశాలాన్ధ్రోపాధ్యాయ పదాధిష్ఠితేన, కౌశిక నన్దనగోత్రజేన, ముక్కవిల్లీత్యుపనామకేన, అన్నప్పదీక్షితేన విరచితా, శ్రీ వరప్రసాదలబ్ధ - సర్వతోముఖ ప్రాణిత్రి విభ్రాజమాన కవితాసామ్రాజ్య ధురంధర మహాకవి కాళిదాసోపజ్ఞాయాః దేవీదశశ్లోకీస్తుత్యాః టీకాయాం ప్రా భావాలఙ్కారభూషిణీసంస్కృతి శ్లోకవిశోషిణీబుధతోషిణీజయతుతరాంశమ్

అర్థము :— వందారు=నమస్కరించు స్వభావముగల, లోక=భక్తులగు ప్రజలకు, వర-కోరికలను, సందాయినీ=ఇచ్చునదియు, విమల-స్వచ్ఛమైన, కున్ద= మల్లిపూవులవలె, అవదాత =తెల్లనయిన, రదనా = దంతములుగలదియు, బృందార =దేవతలయొక్క, బృంద =సముదాయము యొక్క, మణి =చింతామణి మొదలయినమణులయొక్క, బృందా =సము దాయముగలదియు, అరవింద-తామరపువ్వులయొక్క, మకరంద =తేనెచేత అభిషిక్త అభిషేకముచేయఁబడిన, చరణా =పాదములుగలదియు, మంద + అనిల =పిల్లవాయువులతో, ఆకలిత-కూడుకొనిన, మందార= మందారపూ లయొక్క, దామభిః= దండలచే, అమంద-మిక్కిలి. అభిరామ = మనోహ రమయిన, మకుటా= కిరీటముగలదియు. అగు, అరవింద = పద్మమే. అసనా =సింహాసనముగాగల పార్వతీదేవి, మందాకినీ = గంగానదియొక్క జవన=వేగముగల ప్రవాహమును, భిందాన= భేదించునట్టి (తిరస్కరించునట్టి) వాచం = వాక్కును, లేదా మందాకినీ =గంగానదియొక్క, జవ =వేగము గల ప్రవాహముతో, సభిందాన =సమానమయిన, వాచం =వాక్కును, మే=నాకు, దిశతు= ఇచ్చుగాక॥

ఆంధ్రవివరణము:—కవి సర్వశక్తులతోగూడిన ధారాశుద్ధి తనకవిత్వమందు గలుగుగాకయని ప్రార్థించుచున్నాఁడు. అకృత్రిమభక్తులు ఈపార్వతిని నమస్కరించినంతనే యామె వారివారి కోరికల నెఱవేర్చును. అనగా నీమెవలన వరముల బొందవలెనన్న [illegible] ముతేని భక్తి యెడ తెగక యుండవలయునేకాని యితరసాధనము లక్కఱలేదనియు, [illegible] భక్తులయెడ వాత్సల్యముగలదనియు తెలుచున్న [illegible] తెల్లనై స్వచ్ఛమయిన దంతములుగలది. తెల్లని స్వచ్ఛదంతములచే భాగ్యభోగ్యములు గలుగును అని సాముద్రికశాస్త్రము. దేవతలు గుంపులుగా [illegible]

LIBRARY

మూలందు తమవద్దనున్న ... చే పూజించిరి. లీమె పాదములం... పుష్పమకరందముచే నభిషేకమొనర్చి, లేదా భక్తులు ర పువ్వులచే ఎ... అధికముగా పూజించగా ఆ పువ్వు... దలిమకరం పడి పాదములు తడిసినవి. ఈమె మందారపువ్వు... లను తన మందు ధరించినది. అద్దరిమీదనుండి పిల్లవా... చుటచే పరమ శివమంతటును వ్యా... దున్న ఆపార్వ మందాకినీనదీ ప్రవాహము... కవితాధోరణిచే నా గాక. లేదా మందాకినీనదీ ప్రవాహముతో సమానమయినవేగము తనక మందుండునట్లు చేయుము గాకయని ప్రార్థనము. పార్వతీదేవికి వేసినవి శేషము బట్టియు, గంగాప్రవాహ సాదృశ్యమునుబట్టియు తనకవిత్వమునకు ఈ శక్తి యుండునుగాకయని ప్రార్థించునట్లు కవిభావమునుగ్రహించవలెను. ఈకాళిదాసు కవిత్వమందు భక్తులకోరికలను నెరవేర్చునంతటి శక్తి స్వచ్ఛమగు (నిర్దోషత్వము) దేవతలచేగూడ కొనియాడబడుట భా కార మాధుర్యముచే మనస్సు నాకర్షించుట, లోకములందు వ్యాపిం చినుట కింపుగానుండుట, కుంటువడని ధారాశుద్ధి మొదలగు శక్తులు భావము. ఇన్నిగుణములును ఈస్తోత్రమునందు పరిపూర్ణముగానున్నవి. ఈకవిత్వమే సర్వోత్తమమయినదని తెలుచున్నది. ఇదిగాక కవి మొద మందును, చివరిపద్యమందును కవితావిశేషమునే ప్రార్థించుటచే లందుగాని రాజ్యమునందుగాని యితనికి కోరికలేదని వెల్లడియగు “చక్కని కవితగల్గినచో రాజ్యమక్కఱలే”దను లోకోక్తికి నితండు రణగానున్నాడని గ్రహించవలెను.

ఇది శ్రీలక్ష్మీహయగ్రీవానుగ్రహలబ్ధసకలవైభవ కపిత్థపురీ
అన్నపూర్ణ విశాలాక్షీ సుబ్రహ్మణ్యముని సంఖ్యాకా
గ్రజ, రాజమహేంద్రవర పురపాలకసంఘోన్నతపాఠ
లాంధ్రోపాధ్యాయ పదాధిష్ఠిత, కౌశికగోత్రసంజ
ముక్కవిల్లిత్యుపనామక, అన్నప్పదీక్షితనామధే
విరచితంబైన మహాకవి కాళిదాసకృత దేవీమా
స్తికపూజా దశశ్లోకాంధ్రవివరణము సర్వము
సంపూర్ణము.